


## చతుర్థ మొల్ల జయంత్యుత్సవము

1937 వ సంవత్సరము డిశెంబరు నెల 18 వ తేది శనివారము సాయంత్రము నాలుగుగంటలకు, నెల్లూరు వర్ధమాన సమాజమువారి యాధిపత్యమున రాజమహేంద్రవరము ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలాధ్యక్షులగు శ్రీమతి ఉభయభాషా ప్రవీణ బత్తుల కామాక్షమ్మగారి యధ్యక్షతను, చతుర్థమొల్లజయంత్యుత్సవ సమావేశము జరిగెను. శ్రీమతులు చక్కా పద్మావతమ్మ, శంకా బాపాయమ్మగారల ఉపనిషత్ ప్రార్థనతో సభ ప్రారంభమయ్యెను. నెల్లూరు వర్ధమానసమాజకార్యదర్శిగారగు శ్రీయుత గుజ్జము సుబ్బరామయ్యగారు అధ్యక్షురాలిని సభకెఱుకపరచుచు, శ్రీమతి కామాక్షమ్మగారు ఆంధ్రవిశ్వకళాపరిషత్సభ సభ్యులగుటచేతను, ఆంధ్రయువతీ కళాశాలాధ్యక్షులగుటచేతను, వైశ్యసంఘమున సుప్రసిద్ధసంఘ సేవాధురీణులగుటవలనను ఆంధ్రదేశమున నందఱెఱిగినవారనియు నుడివిరి. ప్రసిద్ధ వైశ్యరచయిత్రి యగు శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు బహూకరణ సమావేశమునకు వారధ్యక్షత వహించుట నెంతయు తగియున్నదనిరి. వారంతట కామాక్షమ్మగారిని అధ్యక్షతవహించి కార్యక్రమమును నిర్వహింపగోరిరి. కామాక్షమ్మగారు కరతాళములమధ్య అధ్యక్షపీఠము నలంకరించి ఇట్టి అపూర్వసమావేశమునకు, అధ్యక్షతవహించుటకు మిగుల సంతసించుచున్నామనుచు నీక్రింది యధ్యక్షోపన్యాసము గావించిరి.

సోదర సోదరీమణులారా !

నేడు సుదినము. సుప్రసిద్ధ కవిశేఖరుల కాలవాలమనఁదగు ఈ నెల్లూరు పట్టణమున, కవయిత్రీమతల్లియు, నాదర్శకవిదుషీమణియు, రామపాద సేవాధురీణయునగు మొల్లమాంబ జన్మించియుండు కతంబున నాపె వర్ధంతు లేటేట నిట బహుజయప్రదముగ కొనసాగించుట కేవలము నెల్లూరు వాస్తవ్యులకేకాక యెల్లరకును విద్యుక్తధర్మమనియే యంగీకరింపవలసియున్నది. మఱియు నిట్టి మహోత్సవసమయములందే మహారాజశ్రీ డాక్టరు కె.ఎన్. కేసరిగారు తమ గృహలక్ష్మి స్వర్ణకంకణమును సన్మానపూర్వకముగ నాంధ్రవిదుషీమతల్లుల కొక్కొక్కరికి ఏటేట బహూకరింప నిశ్చయించుకొనుట మఱింత సముచితకృత్యమని యెన్నఁదగియున్నది. పండితులు నిర్వహింపవలసిన యీ యధ్యక్షతను అల్పవిద్యావతినగు నేను నిర్వహింపఁబూనుకొనుట సాహసకృత్యమే యగునని యెఱింగియును డాక్టరు కేసరిగారి యానతి మీఱరాదను కారణమునను క్షమాశీలురగు మీరెల్లరీ యధ్యక్షురాలి తప్పులను క్షమింపఁగలరను ధైర్యమునను నేడు మీ సమక్షమున దృఢముగ నిలుచున్నదాన.

"మొల్ల ఎవరు" అను విషయమున విప్రతిపన్ను లుండవచ్చునుగాని "మొల్ల రామాయణ మెవరిది" అను విషయమున నేరికిని భేదాభిప్రాయ ముండఁజాలదు. ఆమె యింత ప్రశస్తిని బడయుటకు, పూర్వభవమున నెట్టి సుకృతము చేసియుండునో అను ప్రశ్నము నాలో నంకురించుటయే లేదు.

ఆమె రచించిన రామచరిత మొక్కటియే యామె కెంత విఖ్యాతినైనఁ గూర్పఁదగియున్నదని నా నిశ్చితాభిప్రాయము. రసవదుత్కృష్టప్రబంధమనఁదగు నా గ్రంథమును జూచినపుడు కొమ్ములు తిరిగిన పండితులు సయితము మొల్లను స్మరించి యామెకొక్క నమోవాకమును సమర్పింతురనియే నే ననుకొందును.

ఇంత పండితాదరణమును బడయఁగల్గిన కృతిరత్నమును జాణతనమున సానఁబెట్టిన మొల్లమాంబ యెంత వైదుష్యగరిమను సంపాదించియుండునో పాఠకలోక మూహింపఁగలదు. "విద్వాన్ సర్వత్రపూజ్యతే" అను నార్యోక్తి విషయమున "లింగమశిష్యమ్" అని పండితులకు సయితము నొక్కిచెప్పఁగలిగిన మన మొల్లను మన మెల్లరము వర్ధంతుల మూలమున సత్కరించుటయన తల్లిని సత్కరించుటయే యని వేఱుగఁ జెప్పనక్కరలేదు. ఇట్టి విదుషీమణిని శ్రీరికాపథమున నిడికొని నేర్వఁదగిన యంశములనెల్ల నేర్చి మేటికీర్తిని గడించి యాంధ్రవనితలు విదుషీమతల్లులై దేశదారిద్ర్యమును బారద్రోలవలె ననునదియే యీ వర్ధంతుల పరమాశయము.

ఈవత్సరమున శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారికి స్వర్ణకంకణప్రదానము సేయఁబడుచున్నది. ఈమె సుప్రసిద్ధ రచయిత్రి. ప్రసిద్ధములును సులభగ్రాహ్యములునునగు

నీమె వ్యాసముల ననేకమును పత్రికల ద్వారా మనము తెలిసికొనియున్నారము. ఈమె కుముద్వతి, భారతవీరకథామంజరి, క్రీస్తుచరిత్ర, అబిసీనియా విధ్వంసము మున్నగు నితర గ్రంథములనుగూడ పెక్కింటిని రచించియున్నారు. కుముద్వతి అను పుస్తకము స్కూల్ ఫైనల్ పాఠ్యగ్రంథముగ నియమింపఁబడియున్నదని వినియుంటిని. ఈ విదుషీమణి నేఁడీ స్వర్ణకంకణ బహూకరణమున కెంతయుఁ దగియున్నదని నే నభినందించుచుంటిని.

మరొక్కమాట

గత వత్సరములలో నీ కంకణబహూమానము నెల్లూరుమండలమువారికి జరిగియున్నది. రాజాధిరాజులకు సయితము సాచివ్యమొసర్పఁగల కవిబ్రహ్మ నివసించిన "నెల్లూరు" అని నాభావము. కావున తిక్కనను గౌరవించినట్లే మన మెన్నవలయును. ఈనాఁడు రాజమహేంద్రవర వాస్తవ్యయగు కమలావతీదేవిగారిని బహూకరించుట నన్నయను గౌరవించుటయేయని సంతసించుచుంటిని.

ప్రస్తుతము మనదేశము చాలవఱకధోగతిలోనున్నదనియు నిందులకుఁ బ్రబల కారణము స్త్రీలోకమున విద్యాగంధము పూజ్యమగుటయేయనియు మన మందఱ మెఱింగియేయున్నారము. ఇట్టితఱి మన కర్తవ్యము నొరు లుపదేశింపకయే తెలిసికొన శక్యమగుచున్నది. దేశదారిద్ర్యమును దొరగించు విషయ మటుండనిండు. వర్తమానకాలమున నీదేశ మనుభవించుచున్న దుస్థితిని దెలిసికొనుటకయినను విజ్ఞానమత్యావశ్యకమనియే నామనవి.

అయితే యిప్పటి పాశ్చాత్యనాగరికతాలోలుపత్వమే విజ్ఞానపథమని నేను నమ్మజాలను. మన విజ్ఞానము వేఱు. మన ధర్మము వేఱు. మన జాతీయత వేఱు. ఇట్టి మన ప్రాచీన హైందవవిజ్ఞానవికాసము నకు వలయు శిక్షణమును మనము గురుతింపవలయును.

స్త్రీ విద్యావ్యాప్తికై కంకణమును గట్టుకొని కృషిసేయుచున్న డాక్టరు కేసరిగారివంటి ఉదారాశయులను మన వనితాలోకము నిరంతరము ప్రోత్సహించుచుండవలయును. అనఁగా నిట్టి బహుమానముల కర్హతగల విదుషీమణులు వేనకువేలుగ బయలుదేరవలయును. యుగయుగములందును దేశకాలముల ననుసరించి ధర్మములు మారుచుండుట మన మెఱింగియేయున్నారము. కావున నిప్పటి పరిస్థితులను గమనించి దేశౌన్నత్యమునకు వలసిన చట్టములను నిర్మించి తన్మూలమున దేశసౌభాగ్యమును సిద్ధింపఁజేతురని మిమ్ముఁ బ్రార్థించుచు నింతటితో విరమించుచున్నదాన.

నన్నీ యధ్యక్షస్థానమున కాహ్వానించిన శ్రీయుత కేసరిగారికిని యీసభవారికిని నా కృతజ్ఞతావందనము లర్పించుచున్నదాన.

అధ్యక్షోపన్యాసానంతరము వైశ్యులలో ప్రథమ పట్టభద్రులైన శ్రీమతి ఆర్. సుబ్బమ్మగారు, బి.ఎ.,

ఎల్.టి., స్త్రీవిద్యావ్యాప్తివలన గలుగు ఫలితముల గూర్చి యిటుల నుపన్యసించిరి.

మనుష్యజన్మమెత్తుట ఎంతో ఉత్కృష్టమైనది. ఏలననగా యెన్నోజన్మములెత్తిననే గాని మానవజన్మమెత్తుట దుష్కరము. అయినను మనుష్యజన్మ మెత్తినంతమాత్రమున మనము గొప్పవారమని విఱ్ఱవీగుట హాస్యాస్పదము. మానవుడు జ్ఞానమను జ్యోతిని కలిగియుండిననేగాని జన్మను సార్థకపరచుకొననేరడు. 'విద్యావిహీనః పశుః' అని పూర్వులు వచించియున్నారు. అనగా విద్యలేనివారు మృగములతో సమానులు. మృగమునకును, మనుష్యునికిని జ్ఞానమొక్కటియే భేదము. ఇట్టి జ్ఞానమెట్లు కలుగుననగా, "జ్ఞానం విద్యాధీనము" అన్నట్లు విద్యవల్లనే జ్ఞానము కలుగుచున్నది. విద్య మనుష్యున కెవ్విధమున తోడ్పడుననగా సూర్యరస్మి గాఢాంధకారమును పారద్రోలుట కెట్లుపయోగపడునో యట్లే అజ్ఞానాంధకారమును పారద్రోలుటకు విద్య అత్యావశ్యకము. అంధుడు దారినడవలేనట్లు విద్యావిహీనుడు జ్ఞానమార్గమున ప్రవర్తింపజాలడు. సంసారసాగరము తరించుటకు విద్య నావవలె సహాయపడుచున్నది. ఎందరో గొప్పపాండిత్యమును గలిగియుండవచ్చును. పెక్కు పురాణగ్రంథములను అవలోకనము చేసియుండవచ్చును గాని మంచి నడవడిలేనియెడల నదంతయు వ్యర్థమగును.

మనదేశము అధోస్థితియందుండుటకు కారణము స్త్రీలకు విద్య లేకపోవుటయే. ఏదేశమైనను బాగుపడవలయునన్న స్త్రీపురుషు లిద్దరును సమాన జ్ఞానవంతులుగానుండి పాటుపడవలయును గదా! స్త్రీలు విద్యావంతులుకానిచో యేవిషయమందును వెనుకంజవేయుదురేకాని సహాయపడజాలరు. పూర్వపునారీమణులు విద్యావంతులగుటచే రాజకార్యములయందేమి, సంఘసేవయందేమి, ఇది యది యననేల సర్వవిషయములను అతి శక్తిసామర్థ్యములతో నడపగలిగిరి. దీనికి ఆదృశ్యము మొల్లయొక్క కవిత్వమే చాలును. ఆసాధ్వీమణి తన కవితాశక్తిచే గొప్పదగు రామాయణమును రచియించెను. ఇందుచే యామె కీర్తి యాచంద్రార్కమైనది. కాన స్త్రీవిద్య నభివృద్ధిపొందింప గోరి డాక్టర్ కేసరిగారు స్త్రీలకు స్వర్ణకంకణమునొసంగి గౌరవించుచుండుట యెంతయో శ్లాఘనీయముగానున్నది. వారు స్త్రీవిద్యయొక్క వెలను గ్రహించిన మహాశయులు. ఇట్టివారనేకులు స్త్రీవిద్యను ప్రోత్సహించి విజ్ఞానమును కలుగజేయుదురు గాక యని భగవంతుని వేడుచున్నాను.

తరువాత శ్రీయుత చదువుల రామచంద్రయ్యగారు గృహలక్ష్మిపత్రమున, గృహలక్ష్మి కంకణాభిప్రాయమునుగూర్చియు, కంకణస్వీకారమున కుండవలసిన యోగ్యతలనుగూర్చియు నీవిధముగ నుపన్యసించిరి.

సోదరీమణులారా!

మహాశయులారా!

ఇపుడు మనమెంతో ఉత్సాహంతో మొల్లజయంతి జరుపుతూ వున్నాం. అంటే

సుమారుమూడువందల సంవత్సరాలక్రిందట మొల్ల అనే సోదరీమణి పండిత పామరలోకాన్ని ఆనందింపజేసే ఒక మహోన్నత కావ్యాన్ని — రామాయణాన్ని — రచించి ఆంధ్రుల కర్పించింది. అది అప్పటినుండి నేటివఱకు ఆంధ్ర పాఠకలోకానికి అమృతప్రాయంగానేవుంది. ఆంధ్రసారస్వతం సజీవంగా వుండేటంతవఱకు అలాగే వుంటుంది. దాని కవితామాధుర్యాన్ని చవిజూచే మనమంతా అట్టి అమూల్యగ్రంథాన్ని మనచేతుల్లో పెట్టిపోయిన ఆ మహనీయురాలి జ్ఞాపకార్థంగా ఇటువంటిసమావేశం జరుపుతూ వున్నాం అన్నమాట.

ఈసమావేశం జరపడానికి మొల్లయెడల మనకుగల కృతజ్ఞతే కారణమని మనం చెప్పుకుంటాము. అయినా ఇందులో కొంచెం స్వార్థంకూడా వుంది. స్వార్థం ఒక వ్యక్తి మాత్రానికే అయితే గర్హనీయమౌతుంది. అదే ఒక సంఘాభివృద్ధికి కారణమైతే మంచిగుణమే అవుతుంది. ఈ మొల్లజయంతిని జరపడములో మనకుండే స్వార్థంకూడా అటువంటిదే. మన యీలాంటి జయంతులు జరుపుతూవుంటే, సారస్వతసేవకుల గౌరవిస్తూవుంటే మనలో-మన సోదరీమణులలో-ఒకవిధమైన వుత్సాహం బైలుదేరుతుంది.

చూడండి. ఇపుడు ఈసమావేశానికి ఎంతోమంది వుత్సాహంతో వచ్చారు. ఈసమావేశంలో ఏమైన తమాషాలు జరిగితే చూద్దామనో, లేకపోతే విరామం దొరికిందిగదా సమావేశంలో దూరంగా వెనుక బెంచీలమీదకూర్చుని ఎవరితోనో కులాసాగా కబుర్లు చెప్పుకుందామనో ఏఒకరిద్దరైన వచ్చారేమో? అట్టివారెవరూ లేరనే నమ్ముతాను. మిగతావారంతా ఆనందదాయకమైన కావ్యరచనచేసినందుకు మనందరికీ మొల్లమీద ఎంత అభిమానం వుందో వింటారు. సారస్వతసేవచేసే వారందరికీ ఎంతగౌరవం జరుగుతుందో కన్నులారా చూస్తారు. దానివలనకలిగే మేళ్లేమిటో ఆలోచిస్తారు. తాముకూడా అట్టి గౌరవాలకు అభినందనాలకు భాజనులు గావలెనని ప్రయత్నిస్తారు. ఇలాంటి నూతనోత్సాహం అభివృద్ధికి ఎంతైనా సాయపడుతుంది.

ఇటువంటివుత్సాహాన్ని ఇనుమడింప చేస్తుందనే ఇలాంటి సమావేశాల్లో సందర్భాల్లో గృహలక్ష్మి కంకణాదిసత్కారాలతో రచయిత్రులను గౌరవించడానికి పూనుకుంది. ఈ విషయం సోదరీమణుల మనసులోనికెక్కి వారిని సారస్వతసేవకు పురికొల్పితే చాలు. వారంతా తప్పకుండా మొల్లవంటి కవయిత్రులై, రామాయణాలు రచించడానికి సాధ్యంగాకపోవచ్చు. పద్యాలనే అల్లకపోవచ్చు. ఛందోబద్ధంగా పద్యాలు వ్రాసినంతమాత్రానే కవిత్వం వ్రాశారనీ, కవులైనారనీ నేనన సాహసింపలేను. అధునికకవుల్లో ఒకరు ఈ అభిప్రాయాన్నే అతి మనోహరంగా ఒక్కముక్కలో చెప్పివున్నారు.

"కలము పట్టినమాత్రాన కవులుగారు
కవులు వ్రాసినదంతయు కవితగాదు"

అని. కవిత్వమంటే హృదయవికాసం కలిగించి ఆత్మానందాన్ని ఇచ్చేదని అనుకుంటాను. ఇది నిర్వచనంకాదు గాని నాఅభిప్రాయం. ఇటువంటిది పద్యమైనా కావచ్చు. గద్యమైనా కావచ్చు. గేయమైనా అయివుండవచ్చు. ఇంకా విశాలదృష్టితో చూస్తే హృదయవికాసాన్నిచ్చి, ఆనందాన్ని కూర్చే మరేదైనాకావచ్చు మనోహరంగా చిత్రకాడురు చిత్రించిన చిత్తరువులాగ. వుత్సాహపూరితులైన సోదరీమణులు ఇలాంటికవిత్వం కూడా చేయలేరనుకుందాం. తుదకు కాలాన్ననుసరించి సంఘాన్ని అభివృద్ధికి తెచ్చే రచనలైనా తప్పక చేస్తారు.

గృహలక్ష్మికంకణ బహూకరణము యొక్క ఆశయం ఇదే. అయినా అదెట్టి వారిని గౌరవించుతుందో వారి యోగ్యత ఏలావుండాలనో ఈసమయంలో ఒకమారు చెప్పడం మంచిదనుకుంటాను. దీన్ని ఒకముక్కలో చెప్పాలంటే ఇలా చెప్పవచ్చు. సారస్వతసేవ—దానిమూలంగా సంఘసేవ—చేసే స్త్రీలనంతా గృహలక్ష్మి యీవిధంగా గౌరవిస్తుంది. ఈసారస్వతసేవఅనేది పెక్కురకాలుగా వుండవచ్చు. మచ్చుకు కొన్ని చూద్దాము.

ఒకరచయిత్రివుంది. ఆమెరచించిందంతా కవిత్వంగానే వుంటుంది. హృదయవికాసం ఆనందాన్ని కలిగిస్తుంది. అందరి హృదయాలను ఆకర్షిస్తుంది. ఆమెకంతకంటె వేరు విధమైన రచనరాదు. అయినా ఆమె వ్రాసినకొలది రచనలు—పద్యాలే అనుకుందాం—అమృతప్రాయంగావున్నవి.

ఇంకోఆమె వుంది. ఆమె వ్రాసేదంతా గద్యమే. ఆమె రచనలన్నీ కుళ్ళిపోయిన ఆచారవ్యవహారాలపైన దాడితీస్తుంటాయి. దేవుడిచ్చిన తెలివిని అవసరమైనపుడు కూడా వినియోగించకుండా కాలదేశపాత్రాల్లోన్ని మార్పులను గమనించకుండా కళ్లుమూసుకొని నడచేవాళ్లమీద దండెత్తుతవి. ఇందులో కవిత్వంలేకపోతే లేకపోయింది. కాని చదివినవారంతా ఆవ్రాతల్లో సత్యం వుందంటారు. ఆనందిస్తారు. సరిదిద్దుకుంటారు. బాగుపడుతారు. తిట్టిపోసేవాళ్లుకూడా లేకపోలేదులెండి.

ఇంకొకఆమె వుంది. ఆమెది పెక్కుశాస్త్రాల్లో పాండిత్యం. పెక్కుభాషల్లో వైదుష్యం. సర్వసాధారణంగా తెలియనిభాషల్లోని విజ్ఞానం సామాన్యభాషల్లోనికి తెచ్చిపెట్టి విజ్ఞానం వెదచల్లడం ఆమెవృత్తి.

వుదాహరణానికి వీరు ముప్వురు చాలు. వీరంతా సారస్వతసేవ — దానిమూలంగా సాంఘికసేవ— చేస్తున్నారనే నాఅభిప్రాయం. అయినా వీరిమార్గాలువేరు, కాని ఆశయం దానివల్లకలిగే ఫలితమూ ఒకటే. ఈ ఆశయమే వుండి ఇలాంటి ఫలితాన్నే కలిగించేమార్గాలు ఇంకెన్నివున్నా అవన్నీ కూడా గౌరవింపదగినవే, ప్రోత్సాహం చేయదగ్గవే.

ఇట్టిప్రోత్సాహానికి గౌరవానికి గృహలక్ష్మి శ్రీమతి కవితిలక పులవర్తి కమలావతీదేవి గారిలో ఎట్టిగుణం కనిపెట్టిందోచూద్దాము. వీరు ఎంత విద్యావంతులో, ఎంత సారస్వత సేవచేశారో, ఎట్టిఆదర్శాన్ని నెలకొల్పారో

ఎట్టిపరిస్థితులలో రచనల చేస్తూవచ్చారో ముచ్చటించాలంటే వారి విద్యాధికాలనే కాకుండా ఒకటిరెండు ఇతరవిషయాలను కూడా చెప్పవలసివుంటుంది. ఆ లాంటి స్వాతంత్ర్యం తీసికొన్నందుకు కమలావతీ దేవిగారు క్షమిస్తారనుకుంటాను.

కమలావతీదేవిగారు వయోవృద్ధులు కారు. ముప్పదేళ్లకు మించనివారు వారు బాల్యాన అట్టే విద్యాభ్యాసం చేసినట్టు కనపడదు. ఇదంతా ఎందుకంటే వారు గృహిణీత్వం వహించినతరువాతనే విద్యార్జన, రచనలుకూడా ప్రారంభించారు. ఇప్పటికి పదిపండ్రెండు సంవత్సరాలుగా రచనలు చేస్తూవచ్చారు. ఆంధ్రంలో వెలువడే సుప్రసిద్ధపత్రికలన్నీ వీరిపద్యరచనలను ప్రకటించి వున్నవి. ఇవి గాకుండా వీరింతవఱకూ, కుముద్వతి, విజయభాస్కరవిజయము, రాధికా చంద్రావళులు, వీరభారతకథామంజరి, విక్టోరియాక్రాసు, క్రీస్తుచరిత్ర, అబిసీనియా విధ్వంసము, మీార్ జుంలా, అను తొమ్మిది పుస్తకాలనుకూడా రచించి ప్రకటించారు. ఈగ్రంథాలన్నీ చదివిచూస్తే వీరికెన్నివిషయాల్లో ఎంతపరిజ్ఞానంవుందో తెలుస్తుంది. అంతేగాకుండా తెలుగుపత్రికా పాఠకులంతా కమలావతీదేవిగారు ఏవిషయాన్నైనా ఎంత సులభంగా పద్యగద్య వ్యాసాల్లో వ్రాస్తారో ఇదివఱకు చూచేవుంటారు.

'అబిసీనియా విధ్వంసం' అనే వీరి పుస్తకం మొన్న మొన్ననే ఇటలీ అబిసీనియాలకుజరిగిన యుద్ధానికి సంబంధించింది. అందరిపాఠకులలాగే తెలుగు పత్రికలలోని వార్తలను వీరూ చదివారు. అయినా ఎంతమంది ఆ వార్తలవలననే గ్రంథాలువ్రాసేటంతటి సంపూర్ణ జ్ఞానం సంపాదించుకున్నారు? అంటే అటువంటి ప్రయత్నంమైనా వుండదులెండి. వీరు తమ రచనావిధానానికి తోడ్పడేరీతిగా ఆయా వార్తలను చదివి జీర్ణించుకుంటారన్నమాట.

ఇన్నివిషయాలమీాద ఇన్ని సంవత్సరాలుగా ఎడతెగకుండా వీరు చేసేరచనలను చూచి కమలావతీదేవిగారికి కావలసినంత వ్యవధీ, అవకాశాలు వుంటాయని మన మనుకోవచ్చు. కాని వారికీలాంటిఅవకాశం అందరి గృహిణులకులాగే. ఇంకా కొంచం తక్కువకూడానేమో? ఎందుకంటే వీరి విద్యావ్యాప్తి గృహిణీత్వంపొందిన తరువాతనే కలిగింది. గృహిణీత్వం ఎంత భారంతో కూడిందో, ప్రశాంతంగా చేయవలసిన రచనలకు అది ఎంత అనుకూలం కలిగిస్తుందో – గృహిణులు కాదు కాబట్టి మనలాంటివాళ్లకు తెలియకపోవచ్చు – ప్రతి గృహిణికి అది అనుభవమే.

గృహకృత్యాలు, భర్తృసేవ, అత్తమామలకాదరణ, బంధువుల పరామర్శ ఇటువంటివన్నీ కూడా చేస్తూవుండి రచనలను చేయవచ్చునని కొందరు అభిప్రాయపడవచ్చు. అయినా ఇవన్నీవుండి తోడుగా ఆ గృహిణికి ఒక పదిమంది పిల్లలుకూడా వున్నారనుకోండి. అందులో ఆతల్లి హృదయం నలువురైదుగురు పుత్రుల అకాలమర

గాన్ని కూడా ధరింపవలసి వచ్చిందనుకోండి. అప్పుడామె ప్రశాంతంగా రచనలచేయడానికి ఎంత అవకాశంవుంటుందో ఆలోచించండి. నూరుమంది పుత్రులున్నా విసుక్కోకుండా ప్రతివారిసౌఖ్యమూ చూచే ఓపిక మాతృమూర్తికి పరమేశ్వరుడిచ్చేవున్నాడు. కాని అయిదునిమిషాలు కన్నపుత్రుడైనా విడువక ఏడుస్తూవుంటే చీదరించుకోనకుండా వుండే సహనం పురుషునికి పరమాత్ముడివ్వకుండా చాలా అన్యాయంచేశాడు. అందుచేత పిల్లలను ఎంతఓపికతో, ప్రేమతో, సహనముతో పట్టుకరావలెనో అదంతా పురుషుని కేమాత్రము రాదు; ఓర్పు ప్రేమ, సహనమూ మేళవించి రూపొందిన మాతృమూర్తికితప్ప. ఉదయాస్తమానమూ, రాత్రుళ్లు కూడా, బట్టకని, బువ్వకని, పాలకని మాతృదేవత చుట్టుచేరి మారాముచేసే సంతానసైన్యాన్ని సవరించుకోవడానికి ఉన్న ఓరిమీ, కాలమూ అంతా కర్చవుతుంది. పైన ఆమె చేయవలసినవిధులకే కాలం వుండదు. ఇటువంటిపరిస్థితుల్లో, ఇన్నీ తృప్తికరంగా నిర్వహించుకుంటూ, విద్యాభ్యాసం చేసి, పదిపన్నెండేళ్లుగా ఎడతెగకుండా రచనల్ని చేస్తూవున్నారంటే కమలావతీదేవిగారికి ఎంతఓపికా, పట్టుదలా, ప్రయత్నమూ, సారస్వతసేవాభిలాష వుండవలెనో సహృదయు లూహించుకుంటారు. గృహకృత్యాలతో, పిల్లలతో, విసుక్కుంటూ తమజీవితాలు నరకకూపాలని చింతిస్తూవుండే గృహిణులకు వీరికి ఎంత తారతమ్యం?

ఇంకొకటి. మనం సర్వసాధారణంగా వాడుతూవుంటాము 'వివాహం విద్యనాశాయ' అంటూ అదెక్కడో ఏమోగాని సర్వత్రా వర్తించదు. ఎందుకంటే వివాహంగాకముందే విద్యకు తిలోదకాలు వదలుకొని నెపంగా వివాహానికి ఎదురుచూచుకుని వుండేవాళ్లే చాలామంది వుంటారు. కమలావతీదేవిగారి విషయంలో 'వివాహం విద్యనాశాయ' కాదుగదా విద్యాభివృద్ధి అయింది. మార్గదర్శకమైంది. గృహలక్ష్మి కనుగొన్న కంకణార్హత ఇందులో ప్రస్ఫుటమైవుంది. అంతేగాకుండా వైశ్యస్త్రీలలో, యీవిధంగా, నిరంతర ప్రయత్నంతో కొనసాగించిన వారరుదు ఇట్టివారికి 'సంఘసేవా ధురీణ' అని సార్థకనాములైన అధ్యక్షులవారి యాజమాన్యమున గృహలక్ష్మి కంకణబహూకరణము చేయడానికి చాలా సంతసిస్తూవుంది.

బాల్యాన్నే కొంచమో గొప్పో విద్య నేర్చుకున్న సోదరీమణుల్లో ఎంతో మంది గృహిణీత్వం వహించిననాటినుండీ విద్యకు తిలోదకాలు వదలుకుంటారు. కొన్నిచోట్లలో వారు ఒత్తిడికిలోనై మానుకుంటారు. వీరంతా కమలావతీదేవివంటివారలనైనా చూచి గృహిణులుగావుండి విద్యాభివృద్ధికి పాటుపడాలి. పెద్దలైనవారంతా వారి ఆశయాలకు తోడ్పడాలి. ఇది వారికే కాకుండా అందరికీ అభివృద్ధిదాయకము, ఆనందదాయకమూ అవుతుంది ఇటువంటి అభివృద్ధి ఆశయం పెట్టుకునే ఇట్టి రచయి

త్రులను గృహలక్ష్మి గౌరవిస్తూవుందని నే నింతవఱకూ చెప్పడం. ఈ ఆశయం నెరవేర డానికి గృహలక్ష్ము లంతా ప్రయత్నిస్తారని విశ్వసిస్తున్నాను.

ఉపన్యాసానంతరము గృహలక్ష్మి సువర్ణ కంకణమును కరతాళధ్వనులమధ్య అధ్యక్షురాలుగారు శ్రీమతి పులవర్తి కమలావతీ దేవిగారికి తొడిగిరి. తదుపరి శ్రీయుత డాక్టరు కె. ఎస్. కేసరిగారు మొల్లజయంత్యుత్సవమునకు రాజాలక విజయమునుగోరుచు వ్రాసిన ఉత్తరమును, శ్రీయుత పట్టాభిరామరెడ్డిగారి యుత్తరమును అధ్యక్షులుగారు చదివిరి. ఉత్సవమును, కంకణబహూకరణమును అభినందించుచు వ్రాసిన శ్రీమతి చిలకపాటి సీతాంబగారు మొదలగువారి యభినందనముల జదువబడెను. కంకణబహూకరణసమయమున శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారి నభినందించుచు శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ (బొంబాయి) గారు వ్రాసిపంపిన ఈక్రింది నవరత్నముల శ్రావ్యముగ శ్రీయుత మోచర్ల రామకృష్ణయ్యగారు చదివిరి.

క. నవరత్నంబుల పగిదిని
భువిలోన బ్రసిద్ధికెక్కు పూతచరిత నీ
కవనము పలుకుల చెలియకు
నవిరళమౌ భూషలగుచు నలరుఁ గాదే.

క. భారతవీరుల చరితలు
ధీరతరచియించి భారతీదేవిపదాం
భోరుహముల కర్పించితి
వేరీ నీసాటి వనిత లేరీ యనగన్.

క. లలితములగు కవితలు నీ
పలుకుల చెలిచేతి చిలుకపలికెడి కరణిన్
కలకలములగుచు చక్కెర [నుండుఁ.
పలుకులవలె దీయనగుచు బరగుచు

క. అత్తకు కోడలి కెందును
పొత్తుండదటంచుబల్కు ప్రోడలమాటల్
రిత్తలుగజేసె నీకడ
బుత్తడినునుబొజ్జవేల్పు పూతచరిత్రా.

క. కంకణము గట్టికొని నీ
వింకన్ భాషామతల్లి కెనలేనికృషిన్
గొంకక సేయుము వాణి వ
శంకరివై నీకునెపుడు సాయమొనర్చుఁ.

క. హరియొసగుగాక శుభముల [తల్
సిరియిచ్చుత కామితముల జెలువగుకవి
సిరికోడలొసగు గావుత [మిమ్ముఁ.
పరమేష్ఠి చిరాయువిచ్చి పాలించు

క. ఆచంద్రతారకంబుగ
నీచరితము వెలయుగాక నిర్మలతేజో
వీచికల జిమ్ముకొనుచును [కమై.
పూచిన సంపెగలమాడ్కి బుధరంజ

క. ఉవిదారత్నము! తావక
కవితకునిదె వరుణమాలకాన్కగ, నీయు
త్సవమున నిచ్చెద కొనుమో
కవితిలకమ పూలవర్తి కమలాదేవీ.

సరస్వతీప్రార్థనను శ్రావ్యముగా పాడుచు శ్రీమతి కవితిలక పులవర్తి కమలావతీదేవిగారు వారి యుపన్యాసము నిటుల గావించిరి.

సింహపురీకవిసింహములారా! నెల్లూరాంధ్రపురంధ్రీరత్నములారా!

నాకంటికి రెప్పవై, నాజీవితమునకు శక్తివై, నాహృదయమున కీశ్వరుడవై, నన్నోషించుచు, పాలింపుచు, లాలింపుచు,

మర్త్యలోకమున కా యమర్త్యలోకపు టానందమును జూఱగొనజేయుచున్న నాపతి దేవునకు వందనసహస్రంబు లర్పించుచు నేనిక నా యుపన్యాసమును ప్రారంభింతును.

పెన్నానదిచే పూతంబై, రంగనాథేశ్వరుని వాసంబుచే పాపరహితంబై, రెడ్డిజనులచే శోభితంబై, మిముబోటి కవిజనచకోర బంధులచే భూషితంబై, తన యద్భుత కవనంబు పావన శ్రీరామచంద్రుని చరితంబు నాంధ్రయోషారత్నముల హృదయకుహరంబుల భద్రపరచిన యా వాల్గంటి మొల్ల చరించిన యీ నెల్లూరుపురంబున నుపన్యసింపగల్గిన భాగ్యంబు లభించుటంజేసి నేనెంతయు ధన్యురాలను.

గంగాఝర్ఝరి కడుమించి—వియద్గంగాధావళ్యతను వెనుకకు నెట్టించి వినిమెను పండిత ప్రకాండుల హృదయమున మునమును రెట్టించి—శ్రవణకుల హృదయకమలముల కాకోదరశయనుని భక్తిని హత్తించి, భీష్మదాహము బాప ఆఖండవ భూమీశుల గెలచిన యా ఖాండవదహనుడు—నారాయణసఖుడే యర్జునుకు వేసిన బాణము కలనను-చిప్పనబుడమింజీల్చుకొని వియత్పథ మొత్తున జిమ్మెడు భోగిలోక గంగాయురవడి బురుడించెడు—యీధరునందలి రేడిమో తరంగముతో కడునురవడి నా పతితపావనుని—ఆ పుంసామోహనుని—ఆ దుష్ట రాక్షసవిరాముని—రాముని చరితమును గానముచేసిన మొల్లపురంబున నుపన్యసింపబోవుట కడుంగడు సాహసమనియును కమ్మరిపీఢిని సూనులమ్ముటయనియు నే నెఱుంగకపోలేదు.

మా రాజన్యకులచూడామణి—మా రాణ్మహేంద్రపుర భాగ్యవిధాత — మహాభారత నిర్మాతయగు రాజనరేంద్రుడు (?) మీ పురి కవివతంసుడును, నిఖిలాంధ్ర కవిజన సంస్తుత్యుండును, విప్రకులభూషణంబునగు తిక్కన కవిచంద్రునిచే దరిజేర్చి, మన్ననజేసి పల్లకియందు పురంబంతయు నూరేగించి మాన్యంబుల సువర్ణభూషణంబుల నెప్పుడో భారత రచనార్థము దనియింపజేసిన యా మేలును మదిదలంచి తత్పురి అంగనామణులగుట మమ్ము ప్రేమ బిలువన్ వీరని మది నెంచి తండ్రులమోల బిడ్డల కెట్టెజంకును నుండవను నిశ్చయముతో నిటకు విచ్చేసినారము గావున మాతప్పులను విడచి యొప్పులనే గైకొందురుగాన యని ప్రార్థించుచున్నదానను.

ఏకాలమందైనను యేమహారాజైనను స్త్రీల నీవిధముగా సత్కరించినాడా యని యని చరిత్రలను పరిశోధింపగా నెచ్చటను గన్పింపదయ్యెను. విసుగుచెందిన చిత్తముతో మరల పరిశోధింపగా యొక్కటే దృష్టాంతము గాన్పించినది. ఆదృష్టాంతమేమన శ్రీరమణీయమై, విబుధసేవితమై, ఫలపుష్ప నమ్రధాత్రీరుహ కల్పితోపవన దీపితమై సుమనోజ్ఞగేహాశృంగార తరాంతరంబగుచు, కేవల మయ్యమరావతినింబోలి యుజ్జయినీనగరం బొప్పారుచుండు. ఆ యుజ్జయినీ నగరంబునే యవంతిక యని గూడ వాడుచుందురు.

అయోధ్యా మథురా మాయా కాశీ కాంచీ అవంతికా
ద్వారావతీచైవ సప్తైతే మోక్షదాయగా.

మహాప్రళయ ముద్భవించినప్పుడు మరల ప్రాణికోటినంతయు అవంతికయందే పునరుద్భవమందినవని పురాణములు వక్కాణించుచున్నయవి. ఆనగరమునందలి మహాకాలనామమున వెలయుచున్న యీశ్వరుడు లయమొందించుతరి పునఃసృష్టికాదగు కొన్ని జీవుల తన దేవాలయగర్భమున నిలిపినాడట. సముద్రమట్టమునకు 1745 అడుగుల యెత్తుననున్న మాళవపీఠభూమిపై అవంతికా నగరము ఉష్ణాంశురేఖపై నిర్మింపబడిన సుందరకరమైన నగరరాజము. ఈ ఈ ఉష్ణాంశురేఖ నక్షత్రశాలమీదుగా మహాకాల దేవాలయమును దాటి దేవీప్రసాదముల గడచి శిప్రానదీతీరముననున్న రామఘట్ట హరిహరఘట్టముల మధ్యగా వెడలుచున్నది. చరిత్ర యుద్భవించుటకు పూర్వమే మూడువేల వత్సరములనుండి అవంతికపుర వైభవము మన పురాణములలో పేర్కొనబడియున్నది. అయ్యది మన కవిసార్వభౌముడగు కాళిదాసుని నగరము. ఆపురి అంగనామణుల సౌధముల పండితుల నాతడు తన కావ్యములయందు స్థిరజన్మలుగాజేసి యజరామరమగు కీర్తి కాలవాలముజేసినాడు. అవంతికానగర మొకప్పుడు జలప్రళయమువలనను మరియొకప్పుడు ఢిల్లీసుల్తాను అల్తమషు దాడివలనను సర్వనాశన మొనర్పబడినది. అక్కడనే హిందూ బౌద్ధ జైన సిథియను మహమ్మదీయ మతములు ప్రబలినవి. అవంతిక గొప్ప విద్యానిలయము. మహానుభావుడగు శ్రీకృష్ణుడీ పట్టణరాజమునే కాశికంటె నెక్కుడుగ నెంచి సాందీపునివద్ద విద్య గరచినాడు. ఇప్పటికి నక్కడ శ్రీకృష్ణ గురుకులమను నొక గొప్ప దేవాలయము గలదు. దీనినే అంకపీటమని వైష్ణవులు యాత్ర సల్పుదురు. ఇది గొప్ప శైవస్థలము. ఇటనే మహాకాలనామముతో భక్తవశంకరుడగు శంకరుడు వాసముచేయుచుండు. ద్వాదశ జ్యోతిర్లింగములలో నిది యొకటి. ఈ దేవాలయము మహారాష్ట్రనాయకులలో నొకడగు రామచంద్రబాటీయనువానివలన క్రీ. శ. 1235 తరువాత నిర్మింపబడినది. ఈ యవంతికా నగరమునకు వచ్చు తైర్థికుల సంఖ్య అతివిస్తారముగావున నిట నూర్గురు పండాలున్నను సరిపోవకున్నారు ఈ అవంతికా నగరములో యంత్రమహాలు అను గొప్ప నక్షత్రపరిశోధకశాల ఆబ్జరవేటరీ కలదు. దీనిని మహారాజు జయసింహుడు 1693 సంవత్సరములో నిర్మించినాడు. చాల సున్నితమగు యంత్రములు గలవు. సిప్రానది మహా పవిత్రవంతమయినది. అందు స్నానమొనరించువారు సబ్బుతో తోముకొనగూడదు. నీళ్లను మలినమొనరింపరాదు. ఆ సిప్రానదియందు మహాపుణ్యవంతములగు కుణ్మరాజములు నిండియున్నవి. అవంతిక నైదుమైళ్ల దూరమువర కెట్టి హింసయు యే జంతువునకుగాని చేయగూడదని అశోకుడు

శాసించియున్నాడు. చివరకు జలచరములకు కూడ నట్టి యుపకారమును పురవాసులు గావింపరు. ఆ తీరములయం దెల్లెడలను అహింస నుద్బోధించు ప్రకటన లతికింప బడియే యుండును. ఆ సిప్రానదీతీరమున అడవి నెమళ్లు తమ పురులను విప్పుకొని నిర్భయముగ నృత్య మొనరుచ్చు పరులకానందంబు ఘటిల్ల జేయుచుండును. సిప్రానది యందు స్నానమొనరింప వచ్చినవారందరు నొకవిధమైన రొట్టెనొసంగెదరు. అనేక వేల కూర్మములచేతనిండిన యీనదియందు ప్లాటుఫారములు నదిలోనికి నిర్మింపబడియున్నవి. వానిమీద కూర్చుండియే స్నానమొనరింతురు. ఇది మహాతీర్థరాజములలో నొక్కటి. పండ్రెండు సంవత్సరముల కొక పెద్దతీర్థమిట జరుగును. దానికి 12 లక్షలమంది యాత్రికు లరుదెంతురు. ఆనా డెక్కడ దిగంబరయోగు లొక్క యరగంట పెద్ద యుత్సవముతో బయలుదేరి సిప్రానది యందు స్నానమొనరించి వెడలెదరు. గ్వాలియరు మహారాజా ఆకాలమున వచ్చిన సాధుసంతనుల కందరికి అన్నప్రదాన మొనరించును. ఆ అవంతికా నగరమున హరసిద్ధి యను నొక దేవాలయము కలదు. అందొక అద్భుత లక్షదీపస్తంభము గలదు. వైకుంఠ ఏకాదశినాడు దానినిండ దీపములు వెలిగింతురు. ఆతరుణమున దాని శోభను వేయినాల్కలుగల ఆదిశేషుడైన వర్ణింప జాలడు. స్త్రీలు భక్తితో సిప్రానదీమతల్లికి పూవుల నర్పించి రవికలగుడ్డను దక్షణను అందు బడవేయుదురు. ఈ పవిత్రనగర రాజమగు యవంతికను నిజరాజధానిగ చేకొని విక్రమార్క మహీపాలుడు పరిపాలించుచుండెను. ఈ యవంతిక నగరరాజమునుగూర్చి భూగోళశాస్త్రజ్ఞుడగు స్టాన్ హార్డింజి యను మహాశయుడు జాగ్రాఫికలు మాగజీన్ నందు సంపూర్ణమగు వివరముల నొసంగి హైందవుల కృతజ్ఞతకు పాత్రమై విలసిల్లినాడు.

శక నిర్మాతయగు విక్రమార్క క్ష్మాపతి ఆరునెలలు రాజ్యమేలుచు ఆరు నెలలు ప్రచ్ఛన్న వేషమున దేశమంతటయు దిరుగాడుచు దుష్టశిక్షణ శిష్టరక్షణ యొనర్చెడివాడు. అక్కాలంబున ఖన్నా యనెడు నారీమణియొక్క జ్యోతిష్య శాస్త్ర పాండిత్యము దశదిశలవ్యాపించి యొట్టకేలకు నరపాలాగ్రణియొక్క వీనులకు సోకినది. ఆశాస్త్రమునందలి యాపాండితీవిభవమును జూడదలంచి యా క్ష్మాపతి ఖన్నాయున్న గ్రామమున కరిగినాడు. అట్టితరి యొకానొక రాకొమరుండు ఖన్నాయింటికరుదెంచి "అమ్మా! నాజాతకమును పరిశీలించి నేనెంతకాలము జీవించెదనో యెన్ని దేశముల జయించెదనో ఎంతధనమును సంపాదించెదనో తెలుపు"మని కోరిన యావనితారత్నము సునిశితమైనప్రజ్ఞతో జాతకమునంతయు పరిశీలించి "రాకొమారా! నీవింక నెలదినములుమాత్రమె బ్రతికెదవు. కావున పూర్వజన్మ సుకృతమువలనగలిగిన మానవ జన్మమును వృథ సేయక పండితులసత్కరించి



చతుర్థ మొల్లజయంతి – గృహలక్ష్మి కంకణ బహూకరణము.

దైవములబూజించి, బీదలపోషించి, తీర్థములసేవించి ముక్తింగనుము" అని నుడివిన పైత్యరోగికి పంచదారవలె నట్టి యమూల్యమగు హితవును పెడచెవినిబెట్టి యాజగజ్జెట్టి రాజతనయుడు "మానినీ శిరోవతంసమా! నాప్రజ్ఞ నీవెఱుంగవు. నేవిధి నెదిరించి విజయముబొంది నూరేండ్లు జీవింతును. చూతువుగాక" యని ప్రల్లదంబులబల్కి వెడలిపోవుచుండ విక్రమార్కుడు ప్రచ్ఛన్నవేషమున నాతనివెన్నంటి యేమిజరుగునో చూడంజనియెను. ఈసంగతి జరిగిన పదునారవదినమున నారాచబిడ్డడు తమకంబున వేటకుజని యందు నిజపరివారముచే నిర్మింపబడిన మాటుపై నధివసింప చెట్టుపై చెయి వేయుటయేతడవుగా నొక్క కృష్ణసర్పమాతనిచేయిపై కాటువైచినది.

సాహసవంతుడగు నారాచబిడ్డడు తన నిశితకరవాలమున పన్నగముచే కాటువేయబడిన తనవ్రేలిని ఖండించివైచి విషము వ్యాపింపకుండగ తనప్రాణముల గాపాడుకొనినాడు. దానినిగాంచిన క్ష్మాపాలాగ్రణి విక్రమార్క మతిమంతుడు కలగుండువడి విధికన్న మానవప్రజ్ఞయే యెక్కుడేమో యని క్షణమాత్రము భ్రమప్రమాదములకు లోనై మరల జ్ఞానముచే ప్రబోధితుడై గడవు కాలమింకనునున్నందున పరిశీలించిగాని నిర్ధారణకు రాజనదని నిశ్చయించుకొని మాసాంతమువరకు పరిశీలనయందే గడుపుచుండెను. ఘనవైద్యులచే రాజపుత్రుని గాయము మానజొచ్చినది. విధిప్రేరితుడై రాకొమారుడు వేటకరిగి తొల్లి తన్ను కృష్ణసర్పము కాటువైచినచోటునకే యరుదెంచి యందు క్రిందబడియున్న తనవ్రేలినిగాంచి "ఇది నాచేతి నలంకరించియుండునప్పు డెంత యందముగ నుండినది" యని ముచ్చటబడి దానినిదీసి తన చేదితమైన వ్రేలిపై నిడ యందున్న కాలకూటసన్నిభమగువిష మింకను మానుచున్న గాయము గుండలోని కతిత్వరితముగ బ్రవేశించి యాతడు విగతజీవుండయ్యెను. అయ్యది ఖన్నాబెట్టిన యా ఖరుగడువగుట నాక్ష్మాపాలాగ్రణియగు విక్రమార్కు డబ్బురపడి "అయ్యారే! ఈ లలనామణి జ్యోతిష్యశాస్త్ర పాండిత్యమెంత పటుతరమైనది. ఇట్టి లలనాశిరోవతంసంబుల సత్కరింపకున్న నారాజ్యపదవియేల" యని యామె గ్రామంబునకరిగి యామెను బ్రార్థించి యామె భర్తయనుమతితో నిజరాజధానికిం గొంపోయి మహత్తరసన్మానంబుల నారాజీవాక్షిని సంప్రీతాత్మురాలినిగజేసి యదివరకే వేరువేరుశాస్త్రంబుల దిగ్గజముల వంటి తన యెనమండుగురు పండితులకామెను పరిచయమొనర్చి "అష్టదిగ్గజములారా! నేడిదె మీమధ్య నీవిద్దెలసరస్వతిని బ్రవేశపెట్టుచున్నాడను. ఇది మొదలు నాసభలోని మీరలష్టదిగ్గజములను నామంబున గాక నవరత్నంబు లనుపేర బరగగలరని శాసింపుచున్నాడను" అని గౌరవించి చీనిచీనాంబరముల హేమభూషలనొసంగి గౌరవించినాడు. ఆమహారాజొక్కడే నాడు

స్త్రీని గౌరవించినాడు. నేటికి మరల శ్రీయుత డాక్టరు కే. ఎన్. కేసరిగారు మూడువత్సరములనుండి స్త్రీ రత్నముల సత్కరించుచున్నారు.

కృతులందుటకు పల్లకీ చేతబట్టి యెత్తిన శ్రీ కృష్ణదేవరాయలు రాజ్యమేలునాడును, మనుమసిద్ధిక్ష్మాతలేశుడు తిక్కన కవి చంద్రుడుగన్న కావ్యంబును కోరజూపుల చూచుకొన్ననాడును, తెలుగు రాయని యొప్పుగుప్పిటిలోన లేతకస్తూరి గుబాళించు నాడును, ముత్యాలమందిరంబుల సత్కవుల మీద బంగారమేఘులై పాఱునాడును మేము పుట్టలేదని చింతింపబోము. ఏల నందురా నాయనలారా! వారలెల్లరు పురుషులగౌరవించి సన్మానించినారలేగాని స్త్రీల కవితకెట్టి దోహదము నొసంగియుండలేదు.

గీ. పుట్టలేదని చింతింప బోము మేము
పుట్టినారము కేసరీ పుణ్యుడున్న
మహిత సత్కారమందించు మాన్యవేళ
పాయకేజన్మపుణ్యమో జేయుకతన.

ఆడాక్టరు కే.ఎన్. కేసరిగారు నర కేసరి. ఆ కేసరి కాతడేసరి. నేడా మహానుభావు డత్యంత కృపాంతరంగికాంతరంగుడై నాకు బంపిన యీస్వర్ణకంకణమును తమరెల్లరు జూచుచున్నారలుగదా?

ఇట్టి తులలేని బహుమానముచే నాయందంతర్భూతమగువాణిని ప్రోత్సాహించుచున్న యీదానరాధేయున కేమియొసంగి వారి ఋణమును దీర్చుకొనగల్గుదును. కొండంత దేవరకు కొండంతప త్తిరి యొసంగగలమె? అయినను యందుల భక్తికొలంది నేనిపుడు రచింపుచున్న వేంగీరాజ్యపతన మను చారిత్రకనాటకరత్నము నా మహా మహునకంకితమొసంగి కొంతమట్టుకైన యీ స్త్రీజనమిత్రునిఋణమును దీర్చుకొన దలంచియున్నదానను. అది యచ్చుపడు మహద్భాగ్యము లభించునాడు నేను తప్పక దానిని వారికే యంకితమిత్తును.

ఈకంకణస్వీకరణ మహోత్సవసమయమున పరమేశ్వరప్రీత్యర్థమై నాజన్మతరింపు కొఱకు మాయూర వెలసిన భక్తవశంకరుడైన శంకరుని నిత్యపూజార్థమై ముప్పది రూపాయలను, హేలాపురను (ఏలూరు) నందత్యద్భుతముగ మానవసేవనిమిత్తమై యేర్పరుపబడిన అన్నవస్త్రవైద్యవిద్యాదాన సమాజమున కిరువదిరూపాయలను వెరసి తొంబదిరూపాయలనీయ సంకల్పించితినని యిందుమూలముగ తమకు తెలియబరచుటకు మిక్కిలి యానందించుచున్నదానను. ఈమహోత్సవమున ననేకవిధములుగ బాల్గొన్న సోదరసోదరీమణులకు నావందనములు. మొల్లకవిత్వమునుగురించి యించుకైన వర్ణింతమాయన్న మనభాషయందు తగినపదజాలమే లేదన్న నతిశయోక్తి కాజాలదు. నలుమొగంబులుగల నలువకైనను పలుమొగంబులుగల చిలువకైనను వర్ణింప దరముకాదనిన నబలనగు నేనేశ యామె గవితాశక్తిని విద్యాపారంగతులగు మీ ముందర దెల్పుటెట? ఆమె ప్రతిపద్యము

నందును భగవంతునిమహిమ కన్నులకు గట్టినట్లగపడుచున్నయది. నేటి నాయుపన్యాసమును జయదేవ కవిచంద్రుని అష్టపదీ గానముతో బూర్తిచేసెదను."

తదనంతరము శ్రీయుత దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు మాటలాడిరి. కవిత్వ మొకరిసొమ్ము గాదు. అందులో అది పురుషునిదే అని చెప్పుటకు వీలులేదు. ఇది ఋజువుచేయుటకే మొల్ల రామాయణము నతిమనోజ్ఞముగా రచించెను. అనుచు మొల్ల రామాయణమునుండి రసవంతములగు పెక్కుపద్యముల శ్రావ్యముగ జదివిరి.

శ్రీయుత దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు, ప్రసంగించుచు, శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు విద్యాధికులేగాక ఉత్తమ గుణవతులని శ్లాఘించిరి. శ్రీమతి కమలావతీదేవిగారు తమరచనలందు విశాలదృష్టిని గనబరచినారనియు, స్వయంకృషిచేత నంతటి రచనాశక్తిని గల్గించుకొన్నందులకు కొనియాడిరి.

శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు ఉపన్యాసారంభమున చేసిన పతిభక్తిని, సీతాపతిభక్తికిపోల్చుచు, ఆధునికవిద్యావతులు చాలమంది విద్యలోగూడ గుణగణాభివృద్ధి చేసికొనుటలేదనియు, వారటులచేయుట మిగుల గర్హనీయమనియు శ్రీయుత కోటా వరసింహముపంతులుగారు నుడివిరి. ఉత్తమ విద్యావతులయ్యు గుణసముకలైన శ్రీమతులు బత్తుల కామాక్షమ, పులవర్తి కమలావతీదేవిగారల గౌరవార్థము, (రెండుబహుమతులు మొదటివారిపేర, తక్కిన రెండు రెండవ వారిపేర)తో నెల్లూరు బోధనాభ్యసన పాఠశాలయందుగల ప్రాథమికతరగతులలో నుత్తములగు నలుగురిబాలికలకు సంవత్సరమున కొకరికి ఐదురూపాయలవంతున వర్ధమానసమాజము వారి మూలమున నిచ్చెదరని వాగ్దత్తమొనరించిరి. కార్యదర్శిగారి వందనసమర్పణముతో, ఫలపుష్ప చందన తాంబూలముల పంచుటతో సభ ముగిసెను.

# పండుగ పిలుపు

సిరియు సౌభాగ్య దీర్ఘాయుసిద్ధికముగ
నిన్ను దీవించి వ్రాయు మీ కన్నతండ్రి
బలవదభిలాష, నీవు నీపతియుగూడి
వచ్చు సంక్రాంతికిటకు రావలయునమ్మ.

ఇంతకున్ముందు నీ భర్తకీయుదంత
మెంతయుం బ్రతిమాలుచే నెఱుగజేసి
అంతకింతకు మీరు రానందువలన
పంతమో యేమొయనియెడి భయముకలిగె.

గౌరి, మీచెల్లి యిదె నెలగంటబెట్టి
"గొబ్బిపై పూవుబంతుల గూర్చుటకును
అక్క యింకను రాదు సాయమున" కనుచు
విసుగుకొనుచుండె, సోదరీవిధము లివియె!

అత్తవారింట సర్వసౌఖ్యంబులున్న
హృదయవిభుమీది వలపు హెచ్చైకమైన
నాడుపుట్టువు పుట్టింటి కరుగగోరు
పసిడి భూగర్భముం జేరవచ్చులీల!

ప్రియవసంతుతో పొందుపీడ లేక
దూరరాష్ట్రాలకేగియు తిరిగిగాని

## శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మగారు

జన్మవనమును గాంచ నుత్సాహమొంది
వచ్చిపోయెడు కోకిలబాల భాతి!—

విప్పుతెర చాపలెంతయు నొప్పులొలుక
తిరిగి తేసారి తన తొంటితీరమునకు
తొందరించుచు విశ్రాంతి పొందుకొఱకు
ఒదిగివచ్చెడి చిఱుపూవులోడవోలె!—

జలధియిలువీడి యంబరస్థలముమీద
గరువలినిగూడి విహరించి కన్నయింటి
చుట్టరికమునకై చిన్నచుక్కయగుచు
సాగరమునకు దిగివచ్చు జలదమట్లు!—

రమ్ము తప్పక వచ్చుసంక్రాంతి కిటకు
నీ ప్రియునిగూడి ముందుగా నెలదినాలు
స్వాగతముకప్ప నేమియు శక్తికలదు!
చంద్రునకు నూలుపోగన్న చందముగను.

కన్య యీడేరి పెండిలి కాకయున్న
తల్లితండ్రుల కెంతదుర్భరమొ, యంత
కన్న యెక్కుడు పెండ్లియై కన్నపడుచు
సారెచీరకు రాని విచారమమ్మ!

# గృహలక్ష్మీ కంకణ బహూకరణము



అధ్యక్షులు





గృహీతలు

## జీవిత సంగ్రహము

### శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు

వీరు చిన్నతనమందు 4-వ తరగతివఱకు విద్యాభ్యాసముచేసిరి. 13-వ వత్సరముననే వైధవ్య పిశాచమున కెఱయైరి. జ్ఞానాభివృద్ధినికోరి గౌతమీ గ్రంథాలయములోని పుస్తకములవల్ల విద్యాభివృద్ధి నొందిరి. ఆప్రాయమందే 'అబలాసచ్చరిత్ర' మొదలయిన సతీమణుల జీవచరిత్రలు చదువుటచేత కొన్ని సంఘోద్ధరణకరమైన కార్యములు చేయవలెనని సంకల్పములు గలిగినవి. 17-వ సంవత్సర ప్రాయమున భద్రాచలయాత్రయు 19-వ వత్సరమందు దక్షిణమున రామేశ్వరయాత్రయుఁ జేయఁగలిగిరి. కన్యాకుమారి, అనంతశయనము, మొదలయిన మళయాలపు యాత్రలుకూడ ముగించిరి. అటుతరువాత వీరు 20-వయేడు మొదలు చెన్నపురియందు వాసముచేయుట తటస్థించినది. 23-వ వత్సరమున అలహాబాదునందు జరిగిన, వస్తుప్రదర్శనము చూచుటకు బయలుదేరి కలకత్తామీదుగా ప్రయాణముచేసి కాశీ, గయ, మున్నగు పుణ్యతీర్థముల సేవించుచు హారిద్వారము, మధుర, ఆగ్రా, ఢిల్లీ మొదలయిన స్థానములను, బరోడా మున్నగు సంస్థానములను, బొంబాయి మున్నగు నగరములను జూచుటచేత, ఉన్నతవిద్య సంపాదింపవలయునన్న అభిలాష వీరికి కలిగెను. కాని తగిన సహాయము లేకపోవుటచే నిరుపయోగమయ్యెను.

అంత నిరుత్సాహముపొందక, తగిన శాస్త్రజ్ఞుల సహాయమువలన సంస్కృతమభ్యసించుచు వచ్చిరి. అటుతరువాత బెంగుళూరు, మైసూరు, శివసముద్రము, కోలారు చూచిరి.

కొంతకాలమునకు, దానకర్ణ శ్రీనాళం రామలింగయ్యగారు వైశ్యస్త్రీల జ్ఞానాభివృద్ధికొఱకొక సంస్థ స్థాపించవలెననియు, దానికి తగినస్త్రీలు పూనుకొనినయెడల స్థాపించెదనని చెప్పగా బాల్యముననే హృదయక్షేత్రమున నాటిన సేవాబీజములు శ్రీరామలింగయ్యగారి వాక్యామృతముచే మొలకలెత్తినవి. వారి ధనసహాయమున వీరు ముప్పదిమూడవవత్సరమున సంఘమును స్థాపించి ఉడుతాభక్తిని సంఘసేవకు ప్రారంభించిరి. 1923-వ వత్సరమున కలకత్తా, కాశీ, అయోధ్య, హరిద్వారము ఋషీకేశము అటనుండి 750 మైళ్లు కాలినడకచే, యమునోత్తరి (యమునానది పుట్టినస్థలము) గంగోత్తరి, (భగీరథుఁడు తపస్సుచేసి గంగను హిమవత్పర్వతమునకుఁ దీసికొనివచ్చిన స్థలము) బదరికాశ్రమము, నరనారాయణులు తపస్సుచేసిన మహాశ్వేత దీపమును దర్శించిరి. హిమాలయపరిసరములందు కాలినడక ప్రయాణమునకు మూఁడు నెలలకాలము పట్టినది. అటుతరువాత, కడప, కర్నూలు, బళ్లారి, కృష్ణదేవరాయలు పాలించిన ప్రదేశములను జూచిరి.

1924-వ వత్సరమున గుంటూరులోని 'ఆర్యవైశ్యమహిళాసభ కధ్యక్షతవహించి కార్యక్రమమును సమర్థతతో నిర్వహించిరి. అమితోత్సాహముతోడను కార్యదీక్షతోడను సంఘసేవచేయుచునే విశ్రాన్తి సమయములందు విద్వాన్, పరీక్షాగ్రంథముల చదువుకొనుచు వచ్చిరి. 1927-వ వత్సరమున అఖిలాంధ్రరాష్ట్రమహిళాసభయొక్క కార్యనిర్వాహకవర్గమున సభ్యురాలుగా నెన్నుకొనఁబడిరి. నాడుమొదలు నేటివఱకును అట్లు సభ్యురాలనుగనేయుండి సాంఘికముగను, రాజకీయముగను, వైజ్ఞానికముగను ఆంధ్రమహిళలు అభ్యున్నతిని పొందుటకై శక్తివంచనలేని ప్రచారమును సల్పుచునేయున్నారు. ఆవత్సరమే కృష్ణాజిల్లాలో జరిగిన 'అఖిలభారతీయమహిళాసభకు' ప్రధానకార్యదర్శినిగా పనిచేసి సభాకార్యక్రమమును జయప్రదముగ నెరవేర్చుకొనగలిగిరి. వీరుచేయు సంఘసేవకు ప్రాచ్యవిద్యావిషయక పాండిత్యమత్యవసరమని తలంచి, అమితోత్సాహముతో చదువుచున్న విద్వాన్, పరీక్షను 1929-వ సంవత్సరములో ముగించిరి. బెజవాడలో జరిగిన పట్టప్రదానోత్సవమున వైశ్యస్త్రీలలో ప్రథమురాలుగా ఆంధ్ర విశ్వవిద్యాలయమున ప్రాచ్యబిరుదనుులబడసిన యువతులలో ద్వితీయురాలుగాను, విద్వాన్ బిరుదమునందిరి.

ఆవత్సరమే పెద్దాపురమున జరిగిన ఆర్యవైశ్యమహాసభవారు వీరుచేయు సంఘసేవను గురుతించి తమమెప్పును లోకమున చాటుటకయి వీరికి "సంఘసేవాధురీణ" అను బిరుదము నొసంగిరి. బొంబాయిలో నావత్సరమేజరిగిన 'అఖిలభారతీయమహిళాసభకు' తూర్పుగోదావరిజిల్లా సంఘపక్షమున ప్రతినిధిగా వెళ్లిరి.

దానకర్ణ, శ్రీయుత నాళము రామలింగయ్యగారిచే రాజమహేంద్రవరమున 1920-వ వత్సరమున స్థాపింపబడిన వైశ్యసేవాసదనపాఠశాలలో ప్రధానోపాధ్యాయిని గను వసతి గృహమునకు కార్యాధికారిగను పనిచేయుచునే పైనివ్రాసిన కార్యక్రమము లందు పాల్గొనుచుండిరి.

1931-వ సంవత్సరమున ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి అనుమతినొంది వైశ్య సేవాసదనమందే విద్యార్థినులు విద్వాన్, పరీక్షలు చదువుకొనుట కనువగునట్లుగ "ఆంధ్ర యువతీ సంస్కృతకళాశాల" స్థాపింపఁబడినది. నాటినుండియు వీరాకళాశాలకు ప్రిన్సిపాల్‌గా పనిచేయుచున్నారు. 1934 సం॥ నుండియు రాజమండ్రిలోని 'గవర్నమెంటు గరల్సు హైస్కూలు' సలహాసంఘమున సభ్యురాలుగానున్నారు. గౌతమీగ్రంథాలయ కార్య నిర్వాహక సభ్యురాలుగ నున్నారు.

1935 వ సంవత్సరమున రాజమహేంద్రవరమున 'గౌరవన్యాయాధికారిణి'గా నియ మింపబడి విధివిహితముగ న్యాయనిర్ణయమునకుఁ దోడ్పడుచుండిరి.

మఱియు ఆంధ్రవిశ్వవిద్యాలయమున సెనెటు, ఎకడెమిక్ కౌన్సిలు, బోర్డు ఆఫ్ స్టడీసులందును మెంబరుగానున్నారు. స్త్రీవిద్య కత్యంతోపయుక్తమగు ఎంట్రెన్సు, పరీక్షను తిరిగి ప్రారంభింపవలయునను తీర్మానమును యూనివర్సిటీవారిచే నామోదింపఁ జేసి యాచరణలో పెట్టుటకయి చాలప్రయత్నించి సఫలులైరి.

1936 వ సంవత్సరమున భద్రాచలమునజరిగిన ఆంధ్రరాష్ట్రమహిళాసభ కధ్యక్షు రాలుగా నెన్నుకొనబడిరి. తిరువాన్కూరులోని 'అఖిలభారతీయమహిళాసభకు' తూర్పుగోదావరిజిల్లాతరఫున ప్రతినిధిగా వెళ్లియుండిరి.

1937 వ సంవత్సరమునుండియు Ladies Recreation club నకు ఉపాధ్యక్షు రాలుగా నెన్నుకొనఁబడిరి.

గవర్నమెంటు S. S. L. C. పరీక్షలకు వెళ్లదలచిన స్త్రీలకును యూనివర్సిటీ మెట్రిక్యులేషన్ పరీక్షలకు వెళ్లుస్త్రీలకును సౌకర్యములఁ గల్పించుటకయి, "చిత్రలేఖనము, సంగీతము, కుట్టుపని" వీనినిగూడ పాఠ్యవిషయములలోఁజేర్చి వీనికిఁదగిన సిలబసులను నిర్ణయించవలయునని ఒకతీర్మానము 1—12—37 న జరిగిన యూనివర్సిటీ ఎకడెమిక్ కౌన్సిలుకు పంపియున్నారు.

ఆంధ్రయువతీ సంస్కృతకళాశాలలో నిప్పటివఱకు విద్వాన్ పరీక్షలో ప్యాసైన వారు ఏడుగురుకలరు. వీరి ప్రోత్సాహమూలముననే వీరిబంధువులు ముగ్గురుస్త్రీలుకూడ విద్వాన్ పరీక్షను ఫైర్స్టుగచదివి ప్యాసైనారు.

వీరి కళాశాలయందు సంస్కృతాంధ్రాంగ్లములేకాక స్త్రీలకుఁగావలసిన లలిత కళలు – చిత్రలేఖనము, సంగీతము, కుట్టుపని మున్నగునవియు నేర్పబడుచున్నవి. ఈశ్వర సేవయన మానవసేవయని నేటివఱకును కార్యదీక్షను కొనసాగించుచున్నవారు.

## శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు

వీరు ది 6–3–1906 సంవత్సరమున ఫాల్గుణ శుద్ధ యేకాదశినాడు కంచర్ల కామరాజు బి.ఏ గారికిని కంచర్ల సీతా రత్నమాంబగారికిని రాజమహేంద్రవరమున నుద్భవించిరి. రాజమహేంద్ర గవర్నమెంటు బాలికాపాఠశాలయందు రెండవఫారమును పూర్తిజేసిరి. పిమ్మట పులవర్తి వెంకటసుబ్బారావు బి.ఏ గారి పుత్రరత్నమును, ఆంగ్ల భాషాకోవిదుడునగు మాణిక్యం శ్రేష్ఠిగారిని 1917 సంవత్సరమున బరిణయమాడిరి. మామగా రత్యంతప్రీతితో ఆంధ్రపండితుల నియమించి ఇంటికడనే వీరికి వసుచరిత్ర, మనుచరిత్ర, భారత, భాగవతరామాయణాదులను, పారిజాతాపహరణము, విజయవిలాసము, సారంగధర మొదలగు ననేక ప్రబంధరాజములను ప్రతిపదార్థ, అన్వయతాత్పర్యాది విశేషంబులతో నభ్యసింపజేసిరి. వీరి భర్తగారికి తూర్పుగోదావరిజిల్లామండల ప్రధాన న్యాయస్థానమున అసిస్టెంటురికార్డుకీపరుయుద్యోగము. వీరికి వ్యాసరచన పోటీయందు నెల్లూరు ప్రొగ్రెసివ్ యూనియనువారు డాక్టరు కేసరిగారి స్వర్ణపతకమును బహూకరించి యున్నవారు. వీరి గద్యరచన కానందంబునొంది పెద్దాపురమున జరిగిన ఆర్యవైశ్య యువజనసభవారు కవితిలకయనుబిరుదమును స్వర్ణపతకము నొసంగియున్నవారలు. ఈమె విద్యానైపుణ్యమున కానందించి టెక్స్టుబుక్కుకమిటీవారీమె రచించిన కుముద్వతి యనునవలను స్కూలుఫైనలునకు నాన్‌డీటైల్డు బుక్కుగానియమించి గౌరవించినారు. వీ రింతవరకు కుముద్వతి, విజయభాస్కరవిజయము, రాధికాచంద్రావళులు, వీరభారత కథామంజరి, విక్టోరియాక్రాసు, క్రీస్తుచరిత్ర, అబిసీనియావిధ్వంసము, మీర్‌జుంలా యను తొమ్మిదిపుస్తకములను రచించిరి. వీరి రచనలలో పెక్కింటిని గృహలక్ష్మి, భారతి, ఆంధ్రపత్రిక, వినోదిని, వాసవి, భారతీయవైశ్య, జక్కనువైశ్య, ఆనంద, వాహిని మొదలగు పత్రికాపాఠకులెల్ల రెఱింగియేయున్నవారలు. వీరు చీరాల సమీపమునందలి వేటపాలెము, పాలకొల్లు, పెద్దాపురము, రాజమండ్రి మొదలగు పురములందలి సభల కధ్యక్షతవహించి తృప్తికరముగ వానిని నిర్వహించిరి. వీరి యుపన్యాసములు పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు, కాశీ కృష్ణమాచార్యులుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహారావుగారు, మొదలగు పెక్కురు పండిత ప్రకాండులయొక్కయు, జస్టి సుందరం శ్రేష్ఠిగారు, వి. ఎన్. దీక్షితులుగారు, ఎస్. రామస్వామయ్యంగారు మొదలగు పెద్ద పెద్ద యుద్యోగులయొక్కయు, మన్ననలకు పాత్రమైనవి.

# " ముదితల్ నేరఁగరాని విద్యకలదే ముద్దార నేర్పించినన్ "

మానవుడు ఉన్నతిని పొందుటకు స్వశక్తి సామర్థ్యములు పునాదులు. ప్రయత్నము ప్రాణము. అవకాశములు 'ఎలిక్ట్రిక్ లిఫ్ట్స్'-పై కెత్తుట కుపయోగించు విద్యుచ్ఛక్తి యంత్రములు. స్వశక్తిసామర్థ్యము లుండ వచ్చును. ప్రయత్నము కొరతపడకపో వచ్చును. అవకాశములే లేకున్నచో ఉన్నతినిబొందుట కష్టసాధ్యము. సర్వసాధారణులపట్ల నిది దుస్సాధ్యముకూడ.

గని ఎంతపెద్దదైన గావచ్చును. అందు దొరికిన వజ్ర మెంత శ్రేష్ఠమైనను గావచ్చును. దానికి మట్టియు మలినములైన నితర పదార్థములు నంటియుండక మానవు. వానితోగూడ వజ్రము నొక గుడ్డపేలిక యందు ముడివైచి భద్రముగ పదిలపరచుదము. దానిదీప్తి వెలివడుటకు, దాని విలువ తెలియుటకు, దాని యమూల్యత నెఱుక పడుటకు అవకాశముల దూరము చేయుచున్నాము. అపుడు గులకరాతికిని దానికిని యుపయోగమునందు భేదముండదు. మానవుని శక్తి సామర్థ్యములు, జ్ఞానమును అట్టివే-అసాధారణులపట్ల గాక పోవచ్చును.

రత్నము రాయి గాని సజీవికాదు. ఎదుగు పొదుగులమాట నెత్తబనియుండదు. దానివిలువయు, ప్రకాశమును నియమితములు. కాని మానవునిశక్తి సామర్థ్యములు అవకాశములు గలిగినకొలది ఉన్నతిని పొందును. తోడిమానవుల సౌఖ్యమునకు తోడ్పడును.

ఇందు స్త్రీపురుష భేదములు లేవు. న్యూనతాధిక్యత లంతకంటెను. శతాబ్దములుగా మనము సంప్రదాయముల కలవాటు పడిన వారము. మనకు స్త్రీ లశక్తులను భావము ఇంకను కొలదిగ నిల్చియుండుటయందు వింతయేమియు నుండదు. ఇదే యభిప్రాయమే స్థలాంతరమున ముద్రింపబడిన శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులవారి వ్యాసమున నొకచోగలదు. వారందొకచో సత్యభామవంటి వీరనారీమణు లొకరిద్దరుండ వచ్చును. అంద ఱారీతియగుట యసంభవమనిరి. వెనువెంటనే కృష్ణునివంటి భర్త గలిగినచో సత్యభామ కాదు; ఏవనితయైనను వీరనారీమణియయియుండును. అనినారు. వారు వచించినది పరమసత్యము కృష్ణుడు గానిండు. మఱెవరో గానిండు. వీరనారీమణి యగుటకు సత్యభామకు సదవకాశము గలిగించిరి. ఆకాలమున అందఱికట్టి యవకాశములు లేవు. కావుననే సత్యభామ యొంటరి గావలసి వచ్చినది. అందఱికిని అట్టి యవకాశములే యుండియుండెనేని—ఎంతమంది సత్యభామలు! దేశవిముక్తికి స్వదేశ సంరక్షణార్థము పురుషులతోబాటు నేడు వేలకొలది 'సత్యభామ'లు గావలసి వచ్చినారు. వారి కట్టి యవకాశములు కలిగింపబడినవి. కనుకనే భయంకర సంగ్రామములందు పాల్గొని దేశరక్షణ చేయుచున్న వేలకొలది వీర నారీమణులను నేటి ప్రపంచమున మనము చూచుచుండుట.



శ్రీమతి అన్నా చాండీగారు, ఎం.ఎ. బి.ఎల్.

డిస్ట్రిక్ట్ మునిసిఫ్ – తిరువనంతపురము.

"మీ 'లోధ్ర'ను వాడినాను. స్త్రీల ఋతుసంబంధమగు జాడ్యముల కుదుర్చుటకు అపూర్వమగు ఔషధరాజమని చెప్పగలను. తియ్యని రుచిగల్గి, పథ్య పానాదుల పాటింపవలసిన అవసరము లేకుండుటచే, యీమందును సంతోషముగ వాడవచ్చును."

## అపూర్వ సంగీతగ్రంథములు

### గానశాస్త్ర ప్రశ్నోత్తరావళి

ఇందు 1933–1936 వరకుగల గవర్నమెంటు టెక్నికల్ ఎగ్జామినేషన్సు లోని ప్రశ్నోత్తరములను, సంగీత త్రిమూర్తులయొక్కయు, సంగీత వాద్యములయొక్క చిత్తరువులతో తగుసులభశైలిని వ్రాయబడినవి.

160 పుటలు. గ్లేజు. వెల. రు.
పోస్టేజి వేరు.

### గానకళా చంద్రిక

ఇయ్యది సుప్రసిద్ధ గాయకశిఖామణు లందరిచే మెప్పొంది టెక్స్టు బుక్ కమిటీచే అప్రూవ్ కాబడినది.

400 పుటలు. సింకుక్యాలికో వెల రు. 2

వలయువారు:—

అరిపిరాల
సత్యనారాయణమూర్తి,
గ్రంథకర్త,
గాంధీనగరు, బెజవాడ.

## కావలెను

కాకినాడ, అనకాపల్లి గుడివాడ
మొదలగు స్థలములందు
'గృహలక్ష్మి'కి ఏజంట్లు కావలెను.
వివరములకు వ్రాయుడు.

# గృహలక్ష్మి కంఠాభరణము

గృహలక్ష్మియందు ప్రకటింపబడిన మనోహర త్రివర్ణ చిత్ర పటములందు 46 పటములను ప్రత్యేకముగ నేర్పరచి యొక్కొక్క చిత్తరువునుగూర్చి వివిధవిషయములలో వాడుక భాషయందు హృదయరంజకముగ వ్రాయబడినది. ఇందలి రసవంతమగు రచన, మనోజ్ఞమగు చిత్తరువులు, ఎల్లర నాకర్షించు విషయములు వీనినిగూర్చి యితరులేమందురో గమనింపుడు.

"వివిధవిషయాలకు సంబంధించి వివిధనీతులను బోధించే పెక్కుచిత్రాలను సేకరించి, క్రమం ఏర్పరచి చక్కగా ముద్రించారు. వ్యాఖ్యలు కూడా నాతిదీర్ఘంగా, నాతిలఘువుగా—సందర్భోచితంగా వ్రాశారు. రచనా విధానంలో అవలంబించిన పద్ధతికూడా ఆహ్లాదకరమై—బాలికలకు—సుకుమార బుద్ధులకు—చదవడానికి చవులూరుతూ ఆకర్షవంతంగా ఉంది. లోకోక్తులు, ఉపమానాలు, ఉదాహరణాలు—అన్నీ యథాస్థానంలో చక్కగా అమరివున్నవి. * * *

స్త్రీజనానికి ప్రధానంగా నాలుగుదశలలోనూ కావలసిన ఉపదేశం ఈ గ్రంథంలోవున్నదని చెప్పవచ్చును. ఒక్కొక్కబొమ్మను ఆధారంచేసుకుని వ్యాఖ్యాత బాలికలకు ఎంతో ఉపదేశం—విలువగల విషయం—బోధించారనవచ్చు. దేశంలో ప్రస్తుతం క్లిష్టంగావున్న ఎన్నో సమస్యలను చిన్నపిల్లలకు సుబోధమయ్యేటట్లు, తేటతెనుగులో అరటిపండొలిచి చేతిలో పెట్టినట్లు స్పష్టంగా వివరించారు. నిజంగా తెలుగుకన్నెలకు ఈ గ్రంథం మిక్కిలి విలువగల నగ. * ప్రతిభ"

వెల రు. 2 0 0

## గృహలక్ష్మి కార్యాలయము

రాయపేట . మదరాసు

స్త్రీల నింతవఱకు పురుషులే 'హేడ్డింగు' క్రింద నుంచియున్ననుసరే - ఇపుడు వారికి తగిన యవకాశముల గలిగించిన జాలును. వారు పురుషులతో సమానముగ నున్నతిని పొందగలుగుదురు. కొన్నిటియందు పురుషులకంటె మిన్నగ సంఘమునకు-దేశమునకు ఉపకరింపగలరు. వారియున్నతికవకాశముల గలిగింపకుండుట ఆత్మోన్నతికి భంగకరము. విశాలహృదయము గలవారు ఆత్మోన్నతిని అభిలషించెడివాడు "ముదితల్ నేరగరాని విద్యకలదే ముద్దార నేర్పించినన్" అను శ్రీ చిలకమర్తివారి చిరస్మరనీయ వాక్సుధాలహరిపై దేలియాడుచు నైక్యకంఠమున 'జయహే' అనవలసినదే.

స్త్రీలకువలయు నవకాశముల గల్పించి వారి యున్నతివలన రాష్ట్రాభివృద్ధినిగని యుత్సాహముతో నుండునది తిరువాంకూరు రాష్ట్రము. ఇటీవలనే తిరువాంకూరు ప్రభుత్వము శ్రీమతి అన్నాచాండీగారిని మండల న్యాయాధికారిణిగా (డిస్ట్రిక్టు మునిసిఫ్) నియమించిరి. భారతదేశమందే రాష్ట్రమునగాని యింతవఱకు స్త్రీల కిట్టి యవకాశ మొసగబడలేదు. ఈమెయే ప్రథమ న్యాయాధికారిణి. కేరళదేశమందు న్యాయవాదవృత్తి నవలంబించిన మొదటిస్త్రీయు నీమెయే. గడచిన నెనిమిదివత్సరములుగా నీమె న్యాయవాదిని. ఈ కాలమున నీమె చాల నేర్పుతో ప్రవర్తించినది. "పొట్టాశ్ హత్య" కేసునందును, 'కల్లూరుహత్య' కేసునందును నీమె వాదించి నిందితులు నిర్దోషులని నిరూపించినది. నిందితులు విడువబడిరి.

ఈమె మూడు సంవత్సరములుగా తిరువాంకూరు శాసనసభయందు సభ్యురాలు. తిరువాంకూరునందు స్త్రీలకొఱకై స్త్రీలచే ప్రకటింపబడు వారపత్రిక 'శ్రీమతి'. ఈమె దీనికి సంపాదకురాలుగా కూడ నుండినది. ఈమె త్వరలోనే హైకోర్టుజడ్జిగా నియమింపబడవచ్చును. ఈ మాఆశయము నేరవేరుగాక.

అమెరికా సంయుక్తరాష్ట్రము లాది దేశములందు న్యాయాధికారిణులున్నారు. వారు స్త్రీ హక్కుల గాపాడుట కండగ నుండి స్త్రీలకు న్యాయమును ప్రసాదించుచున్నారు. అటులన న్యాయాధికారులకు పక్షపాతము నంటగట్టు సాహసము చేయుచున్నామనుట పొరపాటు. స్త్రీ పురుషుల కిద్దఱికిని సంబంధించిన వ్యాజ్యములందు న్యాయాధికారులే చేయు నిర్ణయముకంటె న్యాయాధికారిణులు న్యాయాధికారులు గలసి చేయు నిర్ణయము శ్రేష్ఠముగ నుండుననుట నిజము. విడాకులు, శిశుహత్యభరణము, మానభంగము, స్త్రీహత్యలాది నేరములుగలవు గదా. ఇందలి ముఖ్యవిషయములను అతిసులభముగా న్యాయాధికారిణులు గ్రహింపగలరు. అంతియగాదు. న్యాయవిరుద్ధము గాకుండ స్త్రీల హక్కులను గాపాడ పాటుబడెదరు. ఇట్టి దృష్టితోడనే పాశ్చాత్యులు న్యాయాధికారిణుల నియమించుచున్నారు. తగిన స్త్రీలకు మనముకూడ నట్టి యవకాశములనే ఇచ్చినచో అన్యాయములకు గురియగు స్త్రీల పరిస్థితులు తప్పక బాగుపడగలవు.

# యుద్ధము – నాగరికత

ఇటీవలజరిగిన ఇటలీ ఇతియోపియా యుద్ధమును గూర్చియు, ప్రస్తుతము జరుగుచుండు చైనా జపాన్ యుద్ధమునుగురించియు, తలపోయువా రరుదు. ఆలోచించువారికి ఆలోచనీయాంశములేవి? యుద్ధమెందుకు? కారణములేవి? సామ్రాజ్యసంపాదనమా లేక శత్రు నాశనమా, అదియు కాకున్న యుద్ధము విధిలేని కృత్యమా? యుద్ధ మానందదాయకమా? యుద్ధములు, యుద్ధసంరంభములు ప్రపంచమంతయు జరుగుచుండ, ప్రపంచశాంతికై పాటుపడుచున్నామని చెప్పు జినివాలోనుండు నానాజాతిసమితి (League of nation's) చేయుచున్న దేమి? ఆ సమితి తన ప్రయత్నములు ఏల కొనసాగించుటలేదు?

'ఆయుధవిసర్జన,' 'అహింస' ఈమాటలు ఉపన్యాసవేదికలపైనను, పత్రికలలోనుమాత్రమే దృగ్గోచరమౌచున్నవి. మన నాయకులు ఈమాటలు చెప్పుచునే సైనికులకు విషవాయు సంరక్షణచేసుకొనుటకు నేర్పుచున్నారు. యుద్ధమునకు సిద్ధులను చేయుచున్నారు. మానవసంహారమునకు భౌతిక రసాయన శాస్త్రములెట్లు తోడ్పడుచున్నవో మనమందరము ఎరిగియేయున్నాము.

జాతినాశనమునకు శాస్త్రములు తోడ్పడుట చాలా క్రూరమైయున్నది. ఈ శాస్త్రములయొక్క విజయములన్నియు నొకటిని మించినది మరొకటై క్రూరముగనున్నవి. శాస్త్రజ్ఞాన మెక్కువైన కొలది మారణయంత్రములు మారణబాణములు క్రొత్తక్రొత్తగ కనిపెట్టబడుచున్నవి. నాగరికత యను ముసుగులోనుండి మృత్యువు తాండవించుచు ప్రజాధ్వంసము చేయుచున్నది. శాస్త్రజ్ఞులు ఈ బాంబులు చేయుటలో కృతకృత్యులే యగుచున్నారు.

ఈ శాస్త్రముయొక్క ఇప్పటికి కడపటి విజయమువలన సమకూరబోవు ఆయుధ మతిక్రూరమై యుండగలదనుటకు సందేహమే లేదు.

జర్మనీలో ఒకబాంబ్ కనిపెట్టబడినది. దాని పేరు రోబెట్ బాంబర్ (Robet Bowber). ఈ బాంబ్ మందుగుండ్లతో వాయుమండలమున వేలకొలది మైళ్లు ప్రయాణముచేసి, నియమితదేశమందు పగిలి ప్రజలను ధ్వంసముచేయగల శక్తిగలిగినది.

ఈ ఆయుధము సిద్ధమైనయెడల జర్మనీనుండి ఇంగ్లాండు దేశమువరకు తాకగల సామర్థ్యము ఈ బాంబునకు కలదు. ఈబాంబుముందర అనేకవత్సరములు విరివిగ నుపయోగింపబడు విషవాయుభరితమగు బాంబులు, పెన్నముద్దలు, పూబంతులవంటివి. ప్రజాధ్వంసకరములగు ఈ సాధనములు ఏల కనిపెట్ట శాస్త్రజ్ఞు లువ్విళ్లూరుచున్నారో తెలియదు.

యుద్ధమునందీ బాంబు నుపయోగించినయెడల శత్రురాజ్యప్రజలు ఏవేళ నెట్టిబాంబుమీదపడునో యన్నభీతిచే యుద్ధమునకు వెనుదీయుదురనియు, కనుక ఈమార్గమున ప్రపంచశాంతి నెలకొల్ప ప్రయత్నించుచున్నామనియు పలుకుదురు.

సమరసన్నద్ధులై సాధనముల తయారుచేసుకొనుచు శాంతిని నెలకొల్పుచున్నామనిన వెక్కిరింపుకాదా? మారణయంత్రములు, కత్తులు కటార్లు ప్రపంచశాంతిని

తెలకొల్పుననన్న పరిహాసాస్పదము కాదా? ఇట్లు నడుపువారినిగురించి ఏమనవలయును?

సృష్ట్యాదినుండియు, యుద్ధములయం దధర్మములు లేకపోలేదు. అట్టివి లేకున్న ప్రపంచచరిత్ర రసవత్తరముగ నుండదు. అది ఉప్పులేనిభోజనమే. కాని నాగరికత ప్రబలినకొలది, యుద్ధములు మాన్పు ప్రయత్నములు కాని, సామదానములచే వారింపలేక విధిలేక చేయుయుద్ధములు కాని కనబడుటలేదు. అటువంటి దగమ్యగోచరముగనే యున్నవి.

వైరము, హింస, స్వార్థము ఇవి ప్రాణులకెల్ల సహజమే. పైజెప్పినగుణములు జీవులకు సృష్ట్యాదినుండియు నున్నవే.

జంతువులు, తత్తుల్యులని మనమెంచెడి యనాగరిక జాతులు సల్పుపోరాటములు, నాగరికులై, విజ్ఞానులై, విద్యానిధులై ఈ ఇరువదవశతాబ్దమున మనము జరుపుచుండు పోరాటములతో పరిశీలించిన, ఆ అనాగరికులే మనకన్న ఎన్నోరెట్లు మేలనిపించుచున్నారు. ఈ నాగరికతావిజ్ఞానములు మన కబ్బకున్న ప్రపంచస్థితి ఎంతయో భిన్నముగనుండి ఈ భీభత్సము లుండవని తోచుచున్నది.

సృష్టియందు జంతువులకు సహజవైరము కొన్ని మృగములకుమాత్రమే యున్నవి. అంతియే కాని, ఆవైరములేని మృగములు, పక్షులు, జలచరములు, నీటియందును, అడవులందును, గగనమందును, స్నేహముగనే సంచరించుచున్నవి.

పులి మేకను, సింహము జింకను చంపుట విధికృతమైనది. మేక పులికిని, జింక సింహమునకు ఆహారము లగుటచే పులిసింహములకవి వధ్యకృత్యములు. అవి తమ ఆకలితీర్చుకొనుటకై సంహరించుటచే, క్షుద్బాధానివారణార్థమే సంహరించుచున్నవి కాని వేరు వైరభావములేదు. క్షుత్తే ప్రధానకారణము.

పులులను పులులు, సింహములను సింహములు సంహరించు విద్య, జ్ఞానము వానికింకను పట్టుపడలేదు. మనుష్యులను మనుష్యులు చంపుకొనితినుట విని యున్నాము. అట్టివారు ఇప్పుడును కొలదిమంది కలరని తెలియుచున్నది.

పైజెప్పిన మృగ, పక్షి, మనుష్యాదులవర్తనము హేయమే కాని, అవి క్షుద్బాధానివారణార్థము కనుక క్షమార్హము.

అనాగరికులగు ప్రజలవర్తనము, నోరులేని, బుద్ధిహీనములైన మృగములవర్తనము ఇంతేమాత్రమే.

నాగరికులై సామ్రాజ్యోతికై బలహీనరాష్ట్రములపైదండెత్తి, శత్రురాజ్యముల కవ్వకొని, ప్రజలను బానిసలనుచేసుకొను అన్యాయవర్తనము, యుక్తాయుక్తవిచక్షణలేని మృగములలోలేదు. అనాగరికులగు అడవియందు వసించు నరులకును లేదు.

బలవంతులచూచిన భయము, సమానులచూచిన జంకు, దుర్బలులయెడ దౌర్జన్యము, నాగరికప్రపంచమందు తాండవించుచున్నది.

పూర్వపు యుద్ధములకును, ప్రస్తుతపు యుద్ధములకును భేదముచూతుము.

అప్పటివారు, వీరునకువీరుడు, బలమునకుబలము ఆయుధమునకాయుధము. ప్రతివీరునికి రథములేకున్న వీరుడు రథముపైనుండి యుద్ధముచేసిన ఆ యుద్ధమధర్మముగా పరిగణింపబడుచుండినది. కనుక ఇంచుమించుగ పరిసమానులై పోరి పరాక్రమముతోపాటు ధర్మరాజ్యమును స్థాపించుకొనుచుండిరి. ఇప్పటివారికి దుర్నీతియే ప్రధానమంత్రమైయున్నది. యుద్ధమునకు ఓరులేయున్న నియమములేదు. చిరిమినపాల్గారు చిన్నబిడ్డలను, జవసత్వములుడిగిన వృద్ధులనుకూడ సైనికులజేసుకొని, క్షణమాత్రమున లక్షలకొలదిజీవుల సంహరింపగల ఆయుధములతో సంహరించి, తనివినొందక, యుద్ధరంగమందుండువారినే కాక, ఇంటనుండు స్త్రీ బాల, వృద్ధులనుకూడ ఏకరీతిని సంహరించినవారిని

సంహరించి, శేషజనమును బానిసలగనొనర్చుకొని, జనశూన్యమైనపట్టణముల నాక్రమించుకొని దేశములు తమదేశీయులచేనిండించి, చిన్న రాజ్యమును పెద్దరాజ్యముగను, పెద్దరాజ్యమును సామ్రాజ్యముగను పెంపొందించుకొని, కాలచక్రముతిరిగి దుర్దశ తమకుపట్టువరకును తాము సర్వభోగము లనుభవించుచున్నారు.

ఈరోజులలో పెద్దలు చెప్పిన చతురుపాయములలో మొదటిమాటిని అనుకొనువారే లేరు. ఆత్మరక్షణ మొదటి మూడుపాయములచే అనివార్యమైనపుడు యుద్ధము నుల్లంఘనీయము.

పురాణ యుగములలోకూడా అధర్మయుద్ధములు లేకపోలేదు. ఆ అధర్మయుద్ధముల కుపయోగింపబడిన సాధనములు ఏవనగా ఒకవ్యక్తియొక్క బుద్ధి వ్యాప్తి, బాహుబలము. ఈసాధనములచే కలిగిన జనక్షయ మత్యల్పము.

ఇపుడు మెషీన్లతో జరుపబడు యుద్ధములలో జరుగు అనిర్వచనీయమైన నరహింస, అగణ్యమగు జనక్షయము, వర్ణనాతీతమగు దేశకల్లోలము సహింపరాని భీభత్స ముతప్ప వేరుకానరాదు.

నాగరికత యనుపేర అధర్మము పెచ్చుపెరిగి మితిమీరుచున్నచో, నాగరికతతోపాటు ప్రపంచము జనశూన్యమగుచుండ, ప్రపంచమున మానవుడే లేనపుడు మనమెంత నాగరికులమోకదా? ఆ నవనాగరికత ఎవరికి కావలయును? ఆ నాగరికత చూడనోచినవారెవరో? వారి యానందమేమెు?

ఈ నాగరికతకన్న అనాగరికులమై శాంతిజీవనము గడుపుట చేయుటెల్ల మేలు. నాగరికతతోపాటు నాశమైన సృష్టిని మరల తెచ్చుకొనవలసియున్నది.

ఇటలీవారికిని, జర్మనీవారికిని యుద్ధములన్న క్రీడలుగనున్నవి. వారి సామ్రాజ్య విస్తారకాంక్ష యధికమై కన్పట్టుచున్నది. ఆ రెండుదేశములు యుద్ధమునకే కాలుద్రవ్వుచున్నవి. ఇపుడు జపాన్‌కూడా చైనావారి నణగద్రొక్కి పైరెండుదేశములతో తులదూగ ప్రయత్నించుచున్నది. ఆహా! ఏమిధర్మము? ఏమిరాజ్యకాంక్ష? ఎంతదురాశ? ఈ అన్యాయమంతయు ఎందులకు? సామ్రాజ్యవిస్తారమునకే! తాము బలవంతులని తెలియచేయుటకే!! తాము బలవంతులైయుండుట బలహీనుల నాశముచేయుటకే కదా. బలమే ధర్మమన్న దింక ఎక్కువకాలము నిలువదు.

బ్రిటిష్‌వారేల యుద్ధమునకు వెనుదీయుచున్నారు, అన్న సంశయము పలువురకు కలుగుచున్నది. బ్రిటిష్‌వారి జంకుకు కారణములేకపోలేదు. అనుల్లంఘనీయమైనచో తప్ప బ్రిటిష్‌ప్రజలు యుద్ధము చేయదలచుకొనలేదు. ఇరువదేండ్లమునుపు జరిగిన యుద్ధమున నాశమందిన ప్రజానష్ట మిప్పటికి పూడుకొనలేదు. మరల యుద్ధమన్న బ్రిటిష్‌ప్రజలు జంకుచున్నారన్న ఆశ్చర్యమేమున్నది?

కాని ఒకటిమాత్రము ఆనందదాయకము. ఇప్పటికైనను, జనక్షయమునుగుర్తించి సమరమునకు జంకుచున్న బ్రిటిష్‌నాయకులు వందనీయులే!

బ్రిటిష్‌నాయకులలో నొకరిద్దరు, మహాత్ముడు చెప్పిన 'అహింస'యే యుద్ధము నరికట్టగలదను విషయము నమ్ముచున్నారు.

నిజమునకు అహింసయను ధర్మమే గెలుచుననియు, బలమను అధర్మముచే జరుగు నరహింస హేయమనియు, విషవాయు సంభరితములగు గుండ్లతోను, నూతనముగ కనిపెట్టబడు మారణయంత్రములతోడను చేయు అధర్మయుద్ధము కట్టుపడకమానదనియు నిరాఘాటముగా చెప్పవచ్చును.

అహింసాధర్మమాత్రము మందుగుండ్లనడ్డునాయన్న సంశయమువలదు. ఏవిధమునకూడా తీర్పరాని యుద్ధసంరంభము అహింసయే మాన్పగలదు.

ప్రస్తుతస్థితిలో మనకు యుద్ధములు పనికిరావు. అందు అధర్మయుద్ధము లసలేపనికిరావు.

మైనవోలు పద్మావతి.

# బూచాడు!

•

'అడుగో బూచాడు...' — తల్లి నోటినుండి ఈమాట వెళ్లగానే కిక్కురుమనరు పిల్లలు. ఎంతేనా అల్లరిచేస్తూండనీయండి, బూచాడిపేరు వినడంతోనే, భయంతో గడగడలాడుతూ తల్లికడుపులో తలదూరుస్తారు. ఇక పిలిచినా పలకరు. పుట్టుపూర్వోత్తరాలులేని ఈబూచాళ్లని చింపిరితలతో, పెద్దపెద్దగుడ్లతో, పొడుగాటి గడ్డంతో, ఒకజోలెతో, — పిల్లలకొరకు పుట్టిస్తారు తల్లులు. భయంకరమగు ఆవర్ణనాచిత్రం వాళ్ల చిన్ని హృదయపీఠాన్ని అలంకరిస్తుంది. భయపిశాచం వాళ్లని ఆవరించుకొంటుంది.

•

మామూలు వేళకు కాస్తముందులేచి తల్లి నిద్రభంగంచేస్తే; చిన్నతనంవల్ల ఏదేనా అల్లరిచేస్తే; ఏవేనా చిలిపిచేష్టలు (పిల్లల స్వభావం కాబట్టి) చేస్తే; ఆకలిలేకున్నా, కడుపులో చోటులేకున్నా, తల్లి తినమన్నంత తినకపోతే; తండ్రివెంట బజారుకెళ్తానని పట్టుపడ్తే; తల్లి స్వేచ్ఛకు ఆటంకం కలగకుండా సాయంత్రంకాగానే, —నిద్ర రాకున్నా—తల్లిపండమన్నప్పుడు పండుకోకపోతే,......ఒక్కసారనేమిటి ప్రొద్దున సూర్యోదయంనుంచి సాయంత్రం నిద్రపోయేదాకా పిల్లన్ని జడిపించటమే తల్లులు,— "అడుగో బూచాడొస్తున్నాడు ..అమ్మో! వాడి పెద్దపెద్దగుడ్లు నిన్నెట్లా ఉఱుముతున్నాయో!...నాకేం? నిన్నే ఆజోల్లో వేసుకుపోతాడులే..."

శూలపోట్లలాంటి ఈమాటలు ఆచిన్ని హృదయాలని ఎంతబాధిస్తాయో, ఎప్పుడేనా యోచించారా తల్లులు? కలల్లోకూడా వాళ్లని వదలరుగా ఈ బూచాళ్లు. నిద్రలోంచి అకస్మాత్తుగా ఉలికిపడి ఏడుస్తూ ఎందుకు లేస్తారు మరి పిల్లలు?

ఒకొక్కప్పుడు పిల్లలు తమ పట్టును వదలరు, బూచాళ్లతో పోట్లాడ్డానికికూడా సాహసిస్తారు (కాని తక్కువ—చాలా తక్కువ) వాళ్లధైర్య సాహసాలని మెచ్చుకొని వాళ్లపై ప్రేమవర్షాలు కురిపింపవలసిన తల్లులు వాళ్లని భయపెడ్తూ వాళ్ల ధైర్యసాహసాలని మట్టిలో కలపడానికి ఎన్ని భగీరథ ప్రయత్నాలు చేస్తారు!

ఇక ఎప్పుడేనా తల్లి "నాయనా! కాస్త ఆపళ్లవాణ్ణిటు పిలు"వంటే, కదుల్తారా?

భయం వాళ్ళ కాళ్ళు కట్టేస్తుంది. పళ్ళగంప జ్ఞాపకమొస్తే నోట్లో నీళ్లూరుతున్నాయి. కాని...'ఆపళ్ళవాడే బూచాడేమో!' అన్న తలంపుగుండెల్లో రాయివేస్తుంది. పిలవలేరు.

ప్రేమతో, ముద్దుతో, ఆశతో, కోపంతో, బెదరింపుతో....పిల్లవానిచేత ఇంటిపనులు ఎన్నైనా చేయించుకోవచ్చు కాని కాస్త పెరటిగుమ్మం గడియవేసి రమ్మంటే...తల బ్రద్దలు కొట్టుకున్నా వెళ్లడు కారణం?.... ......తల్లినేర్పిన విద్యేగా — బూచాళ్లు పెరటిగుమ్మంగుండా వస్తారని. ఇక ఎట్లా వెళ్లటం?

ఒకసారి నేనో స్నేహితునింటికి వెళ్లాను. అప్పుడే వచ్చిన 'Illustrated Weekly' చూస్తూ కూర్చుంటే మావాడి తమ్ముడు_మూడేళ్లకుఱ్ఱాడు — నాదగ్గరికొచ్చాడు. ఏదో కుఱ్ఱాడుకదా అని నాచదువేదో ఆపి వాడికి బొమ్మలుచూపెట్టడం మొదలెట్టాను. ఒక్కనిమిషంకూడా కాలేదు వాడు కెవ్వున కేకవేసి ఏడుస్తూ ఇంట్లోకి పారిపోయాడు. నాకేమీ అర్థంకాలేదు. ప్రక్కకుచూస్తే మాస్నేహితుడు నవ్వుతూ నిలబడిఉన్నాడు. నాకంతా ఆశ్చర్యంగావుంది. "ఏమిట్రా?" అంటే, "మావాడికి పిల్లులంటే చాలా భయం" అని జవాబు.........ఇంతకూ సంగతేంటంటే, ఆబొమ్మల్లోవున్న ఒక సాదారణపిల్లి ఫోటోట ఆధీరుణ్ని జడిపించింది.

పిల్లి ఎవర్ని హింసిస్తుందిగనక! పైగా మనకే అణిగిమణిగి భయపడ్తూ రోజూ ఇంట్లోతిరిగే మనపెంపుడు జంతువేగా! వీటికూడా పిల్లలు భయపడ్డానికికారణం? ...పిల్లలకు ఉగ్గు పెట్టేప్పుడు, పాలుత్రాగించేప్పుడు అన్నంతినిపించేప్పుడు, కంఠస్వరాన్ని మార్చి పిల్లికూన స్వరాలుతీస్తూ పిల్లల్ని జడిపిస్తుంది తల్లి...ఆస్వరాలు వాళ్ల చెవుల్లో మారుమ్రోగినప్పుడు, వాళ్లగుండెభయంచేత ఎట్లా కొట్టుకుంటుందో తల్లికేమన్నా తెలుసునా?

పారాడటం మొదలెట్టిన్నుంచీ పిల్లవాడి తలపై నెక్కి కూర్చుంటారు బూచాళ్లు. చెవిటివాణ్ణి చేసేస్తుంటాయి పిల్లికూన స్వరాలు......కాస్త ఏదేనా కిటికీకమ్ములను పట్టుకు నిలబడ్డానికి ప్రయత్నంచేస్తే, (అక్కడినుంచి పడటమంటే పడమటిదిక్కున సూర్యోదయం కావటమన్నమాట) వెంటనే వెనకనుండి కేక, "లేవెధవా! బుఱ్ఱ పగుల కొట్టుకుంటావా?"అని. ఇక వాళ్లకి స్వేచ్ఛాజీవనమేదీ?

సత్యాన్వేషణలో జయంపొందటానికి ధైర్య సాహసాలు ముఖ్యావసరం; ధైర్య సాహసాలకితోడు మనోబలం; మనోబలం పొందటానికి మంచితరుణం బాల్యం. 'జీవిత సౌధానికి పునాదిరాయి బాల్యం'కాని మన దేశంలో అట్టిబాల్యమే ఎంతనీచంగా జరిగిపోతుందో కాస్త గమనించండి.

గచ్చుతీగ కల్పవృక్షాన్నిలా బూచాళ్ల భయపిశాచాలు పిల్లల్ని ఆక్రమించుకొం

టాయి. జీవితానికి మొదటిపరుగుల్లోనే బోల్తాకొడతారు. వాళ్లల్లోని ప్రకృతిసిద్ధమైన నిర్భయం, స్వేచ్ఛ, చురుకుదనం అన్నీ నశించిపోతవి. వాళ్లల్లో ప్రవహించే వేడి రక్తం చల్లపడిపోతుంది. ధైర్య సాహసాలు అడుగంటిపోతాయి ధీరత్వం భీరత్వానికి చోటుచేస్తుంది. అసలు జీవనమే చప్పబడిపోతుంది.

ఇక వీళ్లుముందు పెద్దవాళ్లై మాత్రం ఏం వెలిగిస్తారు? వాళ్లల్లో ఉద్రేకమేదీ? శౌర్య ధైర్యాలేవీ?...చీకట్లో వెళ్లడానికి భయం; ఒంటరిగా వెళ్లడానికిభయం ....చిన్నప్పటి చిన్న చిన్న పోట్లాటలకి జడిసి ఏడుస్తూ తల్లిని వెతుక్కుంటూ వచ్చేభీరులుముందు జీవితం లోకలిగే ఏచిన్న కష్టాన్నైనా ఎదుర్కోగలరా? భరించుకోనైనా గలరా? వట్టి పిరికిపందలూ, ఎందుకు పనికిరాని దద్దమ్మలూనై పూరుక్కుంటారు. తమ కష్టాల్లో తాము మునిగిందేకాకుండా ఇతర్లనుకూడా ముంచుతారు. తుదకు వాళ్లజీవనమే దుర్భరమై పోతుంది.—ఈ విజయానికి మూలకారణం... తెలియని తల్లుల ప్రవర్తన.

తనపిల్లల జీవనం తన చేతుల్లోనేవుందని తల్లికి తెలీదూ?...మురా, జూగాష్‌వీలే లాంటి మహాతల్లులేగా చంద్రగుప్త, స్టాలిన్ లాంటి గొప్ప వీరుల్ని తయారుచేసింది. మాతృప్రబోధమేగా వీళ్లల్లో శౌర్యమూ, ఉద్రేకమూ రేకెత్తించింది. బాల్యావస్థలో తల్లి గరపగలంతటి శిక్ష తర్వాత ఓ వందటీచర్లు పాతికేళ్లు కష్టపడ్డా వస్తుందా?...కాని మనదేశపు ప్రస్తుతపుతల్లుల శిక్షణే వేరు. పూర్వకాలంనాటి వీరులచరిత్రలు వినిపిస్తూ తమ కుమాళ్లను ధీరుల్నిగాచేయుటకు బదులు, బూచాళ్లకథలు వినిపిస్తూవాళ్లని భీరుల్నిగాచేసేస్తున్నారు. తమ మాటలను వేదవాక్యాలుగా నమ్మే తమ ముద్దుబిడ్డలను ఇట్లా అన్యాయంచేయటం ధర్మమేనా తల్లులకు? పైగా చూడండి:—

“ఆజికితప్పి శత్రువుల
 కొదల లొగ్గితిరేని మేమికన్
గాజులనూడ్చి కత్తులను
 కత్తెళముల్గొని వైరిసేనలన్
తేజమడంచి యీభరత
 దేశము కున్నతిగూర్చి హైందవ
స్త్రీజన శౌర్యముల్ దెలసి
 జేతులుమోడ్పగ జేతుమీతరిన్*

నిజంగా ఇల్లాంటి ఉద్రేకమే వీళ్లల్లో వుంటే — భారతదేశోన్నతికై పాటుపడదలచుకుంటే — ఇకనైనా సత్యాన్ని గ్రహించి తమ సంతానాన్ని అధోగతిపాలు జేయరు.

—ఎస్. వి. కేశవస్వామి.

*శ్రీమతి చిల్కపాటివారు 1935 మార్చి సంచికలో.

# గృహలక్ష్మి

శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

అన్నట్టు సంసారమనే శకటాన్ని భార్యాభర్తలనే రెండెద్దులు నడప వలసినట్లు తోస్తుంది. యింతమట్టుకు పాశ్చాత్యులున్నా అంగీకరించేదే. అందొక యెద్దు గృహకృత్య నిర్వహణానికిన్నీ యింకొక యెద్దు వ్యావసాయికాది వ్యాపారానికిన్నీ యేర్పడ్డట్టు తోస్తుంది. గృహందగ్గిఱికి వచ్చేవఱకే ఆయా పదార్థాలమీద పురుషుఁడికి అధికారంగాని యింటికి వచ్చిన తర్వాత అధికారం అంతా స్త్రీదే. అందుకే అనుకుంటాను కష్టపడి ద్రవ్యమార్జించి కట్టినపురుషుణ్ణి తలపెట్టక స్త్రీపేరుతోనే యిల్లును "ఇల్లాలు" పరంచేశారు అభియుక్తులు.

అంటే? యేమిటో కొంత వివరిస్తాను—భవభూతి "ఉత్సృజ్య ప్రియగృహిణీం గృహస్య శోభామ్" అని వుత్తరరామచరిత్రలో శ్రీరామచంద్రమూర్తిచేత వొకానొకసందర్భంలో ఆయనభార్యను వుద్దేశించి యీ "గృహలక్ష్మి" పదపర్యాయాన్ని వుచ్చరింప చేశాఁడు.

"గృహస్యశోభామ్, గృహస్యలక్ష్మీమ్". యీ రెండూ వకటే అర్థాన్ని యిస్తాయి. యింటియొక్క శోభగాని, సంపత్తుగాని యింకా యేవిధమైన గౌరవం గాని అంతా యింటియజమానురాలిమీఁదే ఆధారపడి వుండడంచేత—

"సాంసారికేషుచ సుఖేషు వయం రసజ్ఞాః" అంటూ శ్రీరామచంద్రునిమీఁదఁ బెట్టి తన యేక పత్నీవ్రతచర్యను వ్యంగ్యమర్యాదయా తెలుపుడు చేసిన భవభూతి—సంసారానికి—

"మూలకందం ముకుందమ్"

సద్భార్యే అని స్పష్టపఱిచాఁడు. కాళిదాసుకూడా గృహిణీధర్మాలు అక్కడక్కడ యేకరువు పెట్టక పోలేదుగాని భవభూతి అంత నిష్కళంకచరిత్రుఁడు కాకపోవడంచేతో యేమో యింత హృద్యంగా ప్రస్తుతవిషయంలో అతనిరచన పుచ్చుకోవలసివుండదు. యింతెఁదుకు? భవభూతి కథావస్తువు యేలాంటిదో కాళిదాసు కథావస్తువు యేలాంటిదో పరిశీలిస్తే వారి వారి అభిప్రాయాలు తేటతెల్లం అవుతాయి. అన్ని లక్షణాలూ అనుకూలిస్తే బోగంపిల్లగూడా గృహిణిగా వుండవచ్చునని శాకుంతలంవల్ల తేలుతుంది— యిప్పటి నవనాగరికులకు పైసందర్భం యెంత అనుకూలమో చదువరులు గమనించాలి. యిఁక భవభూతి కథావస్తువునుబట్టి చూస్తేనో? మన పురాణాదులలో వున్నధర్మాలన్నీ అనుసరిస్తేనే కాని గృహిణీపదానికి నోఁచుకోనే నోఁచుకోదని తేలుతుంది. కథావస్తువునుబట్టి యిలా వ్రాయవలసివచ్చిందేగాని స్వైరిణులు అంటే స్వేచ్ఛాచారిణులు (యేవిషయంలోనేనా సరే) గృహిణీబిరుదధారణానికి అర్హురాండ్రు కారనే విషయం కాళిదాసున్నూ సూచించే వున్నాఁడు.

"యాంత్యేవం గృహిణీపదం యువతయః"

అని గృహిణీధర్మాలు కొన్ని చెప్పి చెప్పి, కట్ట కడను "వామాః కుల స్యాధయః"

అని అన్యథాగా సంచరించే స్త్రీలు కులానికి వ్యాధులవంటివారని అతఁడున్ను తేల్చాడు. అన్యథాగా అంటే? యేలాగ? అంటారేమో? మళ్లీ కొందఱుకవులు ఆవిషయాన్ని తెల్పి వున్నారు.

"శ్లో. గతాఽఽగతకుతూహలం నయనయో రపాంగావధి స్మితం కులనతభ్రువా మధరఏవ విశ్రామ్యతి వచః ప్రియతమశ్రుతే రతిథిరేవ కోపక్రమః, కదాచిదపిచే త్తదా మనసి కేవలం మజ్జతి"

యీశ్లోకార్థాన్ని యిప్పటిస్త్రీలలో నూటికి తొంబదిమంది పరిహసిస్తారని రెయితేఁగికూడా నామనస్సుకు నచ్చి వుండడంచేత వివరిస్తూ వున్నాను. యిప్పటిస్త్రీలు అంతో యింతో అక్షరజ్ఞానం కలిగి వుండడాన్ని నేను అభినందించనివాళ్లల్లో వాఁడను కాను గాని ఆమిడిమిడిజ్ఞానంతో ఆసోదరీమణులు సాహసించి వ్రాసే అప్రౌఢములైన వ్రాఁతలను నేను సుతరామున్నూ ఆమోదించేది లేదు. ఆవ్రాఁత శక్తివో కొంచెం స్పృశించి మళ్లీ ప్రస్తుతానికి వుపక్రమిస్తాను. వొకసోదరి బహుశః "గృహలక్ష్మి" లోనే అనుకుంటాను వ్రాసిందికదా? పురుషులు స్త్రీలనుగూర్చి — "అబలలనిన్నీ పూబోఁడులనిన్నీ విశేషణాలు వుపయోగించి అసమర్థురాండ్రనుగా లోకానికి ప్రదర్శించారనిన్నీ యిది స్వార్థపరత్వ"మనిన్నీ యేమిటో యేమిటో వ్రాసింది. అబల అంటే? బలం లేనిది, అనఁగా 'కదవంత గుమ్మడికాయైనా కత్తిపీటకు లోఁకువ' అన్నలోకోక్తి వుంది. కనక జనరల్‌గా పురుషునికంటే బలహీనురాలని అనుదాన్ని ఆపదంతో కవులు అనుభవంమీఁద వాడి వుంటారు. అంతేనే కాని యేవిధమైన బలమున్నూ లేనిదనే తాత్పర్యం కాదు. కొన్ని కార్యములు పురుషులు సుతరామున్నూ సాధింపలేరనివి సాధించవలసిన వున్నాయి. వాట్లను పురుషులకన్నా స్త్రీలు యుక్తంగా సాధిస్తారు. అందులో వకటి స్పృశించి వ్యాఖ్యానిస్తాను. పసిపిల్లలను అందులో పురుడు మొదలు నుమారు మూఁడేళ్లలోగా వున్నవాళ్లను సాఁకవలసివస్తే వాళ్లు పెట్టే తిప్పలు పడవలసివస్తే స్త్రీకి చెల్లింది గాని యేపురుషుఁడికి చెల్లుతుంది? దాన్నిబట్టే కాదా? పితృస్థానం కంటే మాతృస్థానం గౌరవభాజన మయింది. ఆవయస్సులోవున్న పసికందులు పురుషుఁడిపెంపకంలోకి వస్తే అడుగుతారూ? యిఁక చెప్పేదేమిటి? వాళ్ల గతి? వాళ్లజీవితం అంతరించిం దన్నమాటే, వాళ్లే కాదు. పెద్దవాళ్లనేనా యింత అన్నోదకాలిచ్చి పోషించవలసివస్తే తల్లికే చెల్లింది గాని తదితరులకు చెల్లనేచెల్లదు. అందుకేకదా? అభియుక్తులు భార్యను కూడా యీవిషయంలో తల్లిగా వుల్లేఖించారు.

"భోజ్యేషు మాతా"

అన్నమాట నేఁడు పుట్టలేదు. పిల్లలు పెట్టే చిక్కులు చాలా అసాధ్యంగా వుంటాయి. ఆచిక్కులు యెంతో ఆహ్లాదంగా కూడా భరిస్తుంది తల్లి. అంతేనే కాని అవి చిక్కులనిన్నీ తాను విధిలేక భరిస్తూ వున్నాననిన్నీ మనస్సులో యెప్పుడుగాని వెక్కసపడదు. యీవిషయంలో స్వైరిణులుకూడా తీసిపోరు గాని యేమైనా కులస్త్రీకి యిచ్చినంత గౌరవాన్ని స్వైరిణులకు విజ్ఞులు యిచ్చారుకారు.

"లంజకు పిల్లతగులాటం"

అనే లోకోక్తి దానికి వుద్బోధకమే. శకుంతలని పసికందును వదలిపెట్టి తనంతటతాను నిర్విచారంగా స్వర్గానికివెళ్లిన మేనకవల్లకూడా యీసంగతి విస్పష్టం అవుతుంది. అట్టిపిల్లను స్వయంగా కన్నతండ్రి విశ్వామిత్రుఁడు పెంచకలిగేవుంటే వుపేక్షిస్తాఁడా? పెంచలేక చంపిన అప్రతిష్ఠ తనకు వస్తుందనేభయంచేతనే విశ్వామిత్రుఁడు గాలికి వదలిపెట్టాడంటే? యుక్తి

సహం కాకపోదు. రాజర్షి కదా? ఆయన, బ్రహ్మర్షి కావడంచేత కణ్వుఁడు తనకు యేవిధమైన సంబంధమూ లేకపోయినా ఆపిల్లని తెచ్చి పెంచి పెద్దచేసి అత్తింటికి పంపేదాఁకా తృప్తిపడ్డాఁడు కాఁడు. సాత్త్వికరాజస తేజస్సులకు వుండే భేదం పరిశీలించండి. పెంచడంమాట అలా వుంచుదాం, గర్భధారణం మొదలు శిశువును కనేదాఁకా తల్లి పడే పాట్లకు అంతూ పొంతూ అంటూ వుంటుందా? పోనీ వకసారి అయినా బిక్కులు పడ్డాంగదా అని మళ్లా గర్భధారణానికి భయపడ్డట్లు యెక్కడేనా వింటూన్నామా? యీభయపడకపోవడాన్ని వాదప్రధాలు అన్యథాగా కూడా సమర్థిస్తారని నేను యెఱుఁగుదును. యిప్పుడు అట్టివాళ్లకు సాధనాంతరాలు కొన్ని యేర్పడి వున్నాయిగదా? ఆసాధనాలు గర్భధారణకు భయపడి వుపయోగించేవాళ్లున్నట్లు వినము. విస్తారము సంతానంకలిగితే పోషించలేమనే కారణంతో అనదలైన పురుషులు యీభ్రూణహత్యాప్రాయమైన పనికి ఆలాయపడి స్త్రీలచేత చేయిస్తూవున్నట్లు స్పష్టమే. పాశ్చాత్యసంప్రదాయాలు మన కిట్టివెన్నో దుస్తంత్రాలను నేర్పుతూ వున్నాయి. కనడంవఱకు తల్లిదిగాని భారం, తరవాత సంతానానికి సంబంధించిన యావత్తు శ్రేయస్సులూ తండ్రిగారి ప్రయోజకత్వాన్ని పురస్కరించుకొని వుండేదేకదా? అసలు శ్లోకాని కర్థం వ్రాయడానికి వుపక్రమిస్తూ దానికి యింత అవతారిక వ్రాశాను. దీనికి ముఖ్యఫలితం స్త్రీలను పురుషులు అబలలని వాడడం దురుద్దేశం కాదనిన్నీ యుద్ధాదులకుగాని యేదేనా బరువు మోయడానికేఁగాని స్త్రీలు పురుషులవంటి బలం కలవారు కారనే తాత్పర్యం. వొకసత్యభామ యెప్పుడో నరకాసురుఁడిమీఁద నాలుగో మూఁడో బాణాలు వేసిందే అనుకుందాం, అంతమాత్రంచేసి స్త్రీలంతా పురుషులతో పాటు ఘాటాపాటీ యుద్ధాలలో పరాక్రమం చూపిస్తారనుకోవలసిందేనా? అదిన్నీ కాక ఆయుద్ధ సందర్భం యేలాటిది! శ్రీకృష్ణుఁడంటే? లోకాతీతుఁడాయె. ఆయన చాటునవుండి సత్యభామే అక్కఱలేదు. మఱి యెవత్తేనాసరే ఆమాత్రం పని చేయఁగలదు. ప్రతిఆఁడదానికిన్నీ ఆలాటి లోకైకవీరుఁడు మగఁడెక్కడ దొరుకుతాఁడు. ఆలాటివీరుణ్ణి పెళ్లాడిన ఆఁడది యెక్కడేనా వుంటే ఆవిడను వదిలిపెడదాము. ఆలాటివాడెక్కడా లేఁడనే కారణంచేతే కాదూ? సుభద్ర—"నీవంటిభర్త కావాలనికోరితే శ్రీకృష్ణుఁడు—"నావంటివాణ్ణి నేనే తప్ప యితరులు లేరు. కనక యీఅవతారంలో నీకోర్కె తీర్చే యెడల బొత్తిగా లోకదూష్యంగా వుంటుందనిచెప్పి అవతారాంతరమందు నీకోర్కె సఫల మవుతుం"దని చెప్పినట్టున్నూ — "సుభద్రాప్రాణనాథాయ జగన్నాథాయ మంగళమ్" అనే జగన్నాథస్వామి శ్రీకృష్ణుఁడే అయి ఆమెకోర్కెను తీర్చినట్టున్నూ ఐతిహ్యంవల్ల తెలుస్తూవుంది. కనుక అందఱూ సత్యభామలు కారు. "నఖలు సర్వోఽతి వత్సరాజః." యిఁక తాటక వొకర్తి వుంది. దాని మొగం తగలఁబెట్టిరి. ఆపాపిష్టిముండని ఆదర్శంగా పెట్టుకొని పంచరిద్దామనే స్త్రీ అంటూవుంటుందా? వుంటే అప్పుడు చూచుకుందాం. యిప్పుడు దాన్నిగూర్చి వ్రాయనక్కఱలేదు. "పూఁబోఁడి" అన్నందుకే, "అబల" అన్నందుకే పురుషులను కొంత నెపపెట్టే సోదరీమణులు అతాటకతో పోలికె చెప్పి "రాతిబోడి" వగయిరాపదాలతో వ్యవహరించడానికి సహిస్తారని నేనే కాదు యిప్పటి నవనాగరికశిఖామణులున్నూ అంగీకరించరు. 'స్త్రీలు జనరల్‌గా పూఁబోఁడులే అబలలే'—యెక్కడేనా నూటనాట రాబోడులూ సబలలూ వుంటే వుంటారు అది గణనీయంకాదు. పురుషులలోకూడా అక్కడక్కడ పూబోడులు అబలలు వుంటారు. వున్నా వారు స్త్రీలు వహించవలసిన గర్భధారణాదులకు అర్హులుగా వుంటారనుకోవడం బాగుంటుందా? అదేలాటిదో యిదీ ఆలాటిదే—

కా. "ఎద్దుల్ బండికి రెండు"

అన్నట్టు సంసారమనే శకటాన్ని భార్యాభర్తలనే రెండెద్దులు నడపవలసినట్లు తోస్తుంది. యింత మట్టుకు పాశ్చాత్యులున్నూ అంగీకరించేదే. అందొక యెద్దు గృహకృత్య నిర్వహణానికిన్నీ యింకొకయెద్దు వ్యవసాయికాది వ్యాపారానికిన్నీ యేర్పడ్డట్టు తోస్తుంది. గృహాందగ్గిఱికి వచ్చేవఱకే ఆయా పదార్థాలమీఁద పురుషుఁడికి అధికారంగాని యింటికి వచ్చినతర్వాత అధికారం అంతా స్త్రీదే. అందుకే అనుకుంటాను కష్టపడి ద్రవ్యంఆర్జించి కట్టినపురుషుణ్ణి తలపెట్టక స్త్రీపేరుతోనే యిల్లును "ఇల్లాలు"పరం చేశారు అభియుక్తులు. యింతేకాదు—

'గృహిణీ గృహ ముచ్యతే'

అనిచెప్పి, యింటికిన్నీ యిల్లాలికిన్నీ అభేదాధ్యవసాయంకూడా చేసివున్నారు. యింత స్వాతంత్ర్యం యేపాశ్చాత్యులూ యివ్వనే లేదేమో? యెన్నివిధాల చూచినా మహారాజుల భార్యలదగ్గిఱనుంచీ స్త్రీలు అంతో యింతో వంటవ్యాపారంలో పాల్గొనడం వుంది. జమీందారురాలు శ్రీ బుచ్చి సీతయ్యమ్మగారు వుబుసుపోవడానికి కూరలు తఱిగేవారని విన్నాను. ఆమధ్య యెక్కడో చదివినట్లు జ్ఞాపకం. యేమనంటే? యెవరో వక సోదరీమణి—"వంట చేయడం అనాదిగా పురుషులకే యిటీవల ఆపని అన్యాయంగా పురుషులు స్త్రీలకు అంటకట్టి వంటలక్కలనుగా చేశారు. యీపని పురుషులదే కాకపోతే—

"నలపాకం, భీమపాకం"

అంటూ సర్వత్రా ప్రచారం వుండడమేమి ?—

"దమయంతీపాకం, ద్రౌపదీపాకం"

అనేమాటలకు ప్రచారం లేకపోవడమేమి? అంటూ వక చక్కని యుక్తికూడా చెప్పింది. యీయుక్తి అపాతరణీయంగా వున్నా తేలకొలఁదిజనానికి వంట వండవలసివస్తే మొగవాళ్లు చేయవలసివుంటుందనే కాని సామాన్యంగా గృహభారం నిర్వహించుకోవడానికి పురుషులమీఁద వంటపని వుంటుందని కాదని వేఱే చెప్పవక్కఱలేదు. అసలు శ్లోకార్థం వ్రాయనే లేదు. వ్రాస్తున్నాను.

చూపులయొక్క ప్రచారము నేత్రాంతములను దాఁటకూడదనిన్నీ, నవ్వు పెదవి దాఁటకూడదనిన్నీ వాక్కు పెనిమిటియొక్క చెవికిమాత్రమే వినపడునంతలో నుండవలసి వుంటుందనిన్నీ కోపము రానే కూడదు, వొకవేళ వచ్చినప్పటికీ దాన్ని మనస్సులోనే యిముడ్చుకోవలసి వుంటుందనిన్నీ భానుమహాకవి రసమంజరిలో కులస్త్రీలక్షణాలు వివరించి వున్నాఁడు. యీశ్లోకలక్షణాలకు వ్యంగ్యమర్యాదయా వ్యాఖ్యానం చేయవలసివస్తే చాలా పెరుగుతుంది. "అతిథిదేవ" అనేమాటకు స్ఫురించే వ్యంగ్యాన్నిమాత్రం చూపుతాను. అతిథి యెవరింటికేనా వెళ్లేటప్పుడు భయపడుతూ భయపడుతూ వెడతాఁడుగాని ప్రాభవంగా వెళ్లఁడు. అలాగే ప్రియునితో చెప్పేమాటకూడా భయభక్తులను పురస్కరించుకొన్నదిగా వుండాలని తాత్పర్యం. యిది పతివ్రతలుగా వుండే కులస్త్రీలకు ఆజన్మతః అలవాటుపడే లక్షణం. యిలాటి వుత్తమురాండ్ర సహవాసంవల్ల మఱికొందఱు నేర్చుకోవడమున్నూ తటస్థింప వచ్చుననుకోవచ్చును. సావిత్రివగైరా మహాపతివ్రతా శిరోమణులు యముణ్ణికూడా మెప్పించఁగలిగారంటే యీలాటి అసిధారావ్రతానికి అలవాటుపడియ్యేనే అంతేకాని వుద్యోగాలు చేసి వూళ్లు యేలీకాదు. వొకపతివ్రతకు జంకి సూర్యుఁడే వుదయించలేదుకదా? వకపతివ్రతకు చేయఁబూనిన అవమానకారణంచేతనే కదా మూఁడులోకాలు గడగడలాడించి రావణాసురుఁడు సపుత్రమిత్రంగా నశించాఁడు. అట్టి పాతివ్రత్యం అందఱికీ సులభసాధ్యం కాక పోవచ్చును

గాని దానికోసం ప్రయత్నించకూడదని యెవరు చెపుతారు?—

“బహుజన్మ కృతతపఃపరిపాకమునఁ గాని” అట్టియోగం చేకూరుతుందా? చేకూరఁగాక మానుఁగాక దానికై ప్రయత్నం చేస్తూవుండే స్త్రీకి పుణ్యలోకాలల్లో మెప్పు కలుగుతుంది కాని యితర స్త్రీలకు మెప్పు కలగమంటే కలుగుతుందా? మహాసామ్రాజ్యాన్ని పరిపాలించిన చక్రవర్తిని విక్టోరియా మహారాజ్ఞికి పాతివ్రత్యంవల్ల వచ్చినయశస్సే యెక్కువో? రాజ్యపరిపాలనవల్ల వచ్చినయశస్సే యెక్కువో ఆమె చరిత్రను సవిమర్శంగా చదివిననారీమణులు తెలుసుకోకుండా వుండరు. ఆమెచరిత్రను బట్టిచూస్తే పాశ్చాత్యులుకూడా యీవిషయంలో మనతోపాటువారే అని తేలకపోదు. ఉన్నతవిద్యాభ్యాసం వగయిరాలు పురుషులతోపాటు స్త్రీలుకూడా చేయవలసివస్తే యిప్పటిపద్ధతిని కొంత స్వేచ్ఛాసంచారము అవసరం కావలసి వస్తుంది. అట్టిస్థితిలో ఆసంచారం యెంత నియమబద్ధంగా వున్నా యీలోకాన్ని మెప్పించఁజాలదు. అందుచే అంతదాఁకా భార్యాత్వభారాన్ని వహించకుండానో వహించనప్పటికీ దాన్ని అమల్లోకి రాకుండానో విద్యావిషయంలో కృషి చేయవలసివస్తే కాని పిమ్మట యేవుద్యోగమో చేయవలసివస్తే గృహనిర్వహణాన్ని భర్తపరం చేయవలసివస్తేకాని అది యేదోవిధంగానే వుంటుందిగాని సహృదయరంజకంగా వుంటుందని విజ్ఞులు అనుకోరు. అసలు వివాహమే వదులుకొనిగాని లేదా? వివాహం అయికూడా దైవలోపంకలిగి తిరిగీ యిప్పటి నూతనాచారాన్ని బట్టి సంసారంలో ప్రవేశించడానికి యేవగించుకొనిగాని ఉన్నతవిద్యాభ్యాసం చేసేయెడల అవకాశం వుంటుందిగాని తక్కిన స్త్రీలకు వుంటుందని తోఁచదు. యెవరినిగురించి నేను యీలా వ్రాయడం? నేను వుదాహరించిన శ్లోకార్థానికి వుదాహరణంగా వుండాలనుకొనే స్త్రీలనుగురించి మాత్రమే.

(ఇంకావుంది)

---

## ఆ ల కిం పు

ఈనిషిద్ధ దురాగతమైన జీవి
తంబు; ఆశామలీమసాధ్వాన్నమైన
ఈతమోరాశి యీపరిదూతశితవి
భిన్నసంభిన్న వర్తన మెన్నినాళ్లు
గడిపెదో శాంతిలేని యీవుడమిపైని
నడపెదో పేర్మిలేని యీయొడదపూని
అల ప్రభాతంబుగడచి సంధ్యాప్రదోష
మిట ప్రయాణంబుసలువు టింకేమిఫలము
తోట పువ్వుపూయుకాలంబు తొలఁగిపోయె
ఇచట ముల్లేరుకొంట నీకేమిఫలము
పక్షులన్నియుఁ గూళ్లల్లి పవ్వళించె
ఇపుడు పుల్లలుత్రెంప నీకేమిఫలము
గుఱ్ఱములు పందెములు గెల్చుకొన్నవపుడె
ఇపుడు లాయంబువిప్పె దింకేమిఫలము
తోడివారలుచదివి యుద్యోగులైరి
ఇపుడు నీయుత్తరాభ్యాస మేమిఫలము
పొలముపండించి కోసుకుపోయినారు
ఇట్లు పరగేరుకొనుట నీకేమిఫలము
మూడుజాములు నాటకమాడినారు
ఇపుడు టికెట్టుకొనెద వింకేమిఫలము
వలపువాకిట వయసెల్ల వెడలిపోయె
ఇంక నెఱసిన తలను పూలేమిఫలము.

ఉమర్ అలీషా.

# గుణవతి

శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారు

## లేదులేదమ్మ దేవుఁడు లేదు సుమ్మ!

గీ॥ అనిన చెలిఁజూచి తలయూచి యనియెనిట్లు
నాకు దిక్కెవ్వఁడో వాఁడె నీకుదిక్కు
దిక్కుగల లేనివారికి దిక్కెవఁడొ
తెలియు మా దేవుఁడే నీకుదిక్కు సుమ్మ.

గీ॥ అఖిలజగమున కాధారమతఁడె సుమ్మ
బీదలకుసాదుల కతండె పెన్నిధి సుమి
యడవిలో బందులనుజూపు నతఁడెసుమ్మి
మఱువ కతనిసేవించుటే మంచిది సుమి.

గీ॥ ఎట్టివేళల నెటనున్న నెవ్వరైన
నెవ్విధినినైన నాపరమేశ్వరునకు
భక్తిజేసి ధ్యానించుటే పరమసుఖము
దేవుఁడెట్లుతలంచునో తెలియుగలమె.

గీ॥ అనిన వనరుచు నిట్టులాయమ వచించె
వదిన యెచట నీదేవుని వెదకిపట్టి
నావు నిజముగ దేవుఁడున్నాఁడటమ్మ
దేవుఁడున్న దీనులబాధఁ దీర్పరాఁడె.

గీ॥ అందరికి తానెదిక్కగు నాతఁడేల
నామొఱాలింపనేరఁడో నన్ను గాంచ
లేఁడొ కఠినుఁడొ యెచటనున్నాఁడొ వదిన
యతనినమ్మినఘనలాభ మమరునొక్కొ.

ఉ॥ నమ్మితి నిన్నినాళ్లు వది
నా మది దేవుఁడు బ్రోచునంచు నే
నమ్మక మెల్లఁబోయె నిక
నల్వురిలో నగుబాటులాయె నా
నెమ్మది శాంతిబోయె నెద
నిల్వగ నీడయులేకపోయె నే
డమ్మక చెల్ల దేవుఁడన
నాత్మదలంప నసహ్యమాయెగా.

గీ॥ దేవుఁడేయున్న సుజనులు భావమలర
తన్నెపుడునమ్మి ధర్మపద్ధతినినడచు
వారె తీరనికడగండ్లు వడగనేల
దుష్టమతులకు సౌఖ్యముల్ దొడరనేల.

గీ॥ అరయ నివియన్ని యాదేవుఁడాచరించు
నవకతవకపనులు గాదటమ్మ వదిన
దేవు నిల నమ్మువారికిఁ దిక్కులేదు
నిజముజెప్పెద నిలనాకు నీవెదిక్కు.

గీ॥ మంచిచెడుగుల మదివిచారించుకొనక
పరులవంచించుచును స్వలాభంబువెదకి
కొని సుఖించుటయే తెల్వియనగవచ్చు
సత్యమునకెన్న సంకెలల్ సత్యమరయ.

చ॥ తలపున రేయునుంబవలు
దప్పక ప్రార్థనజేసి దేవునిం
గొలిచితి ధర్మపద్ధతియు
గూరిమియుఁ గలనమైనబాయకన్
నిలిపితి నాథుపై నెపుడు
నిశ్చలభక్తిని సేవజేసితిన్
నెలమి హృదేశునందుమతి
నిప్పటికిన్ విడదీయ దేరగా.

క॥ ఎప్పుడు నాహృదయేశుని
తప్పక సేవింతుమదిని దైవంబని నా
కిప్పటికి ముక్తిగలుగ ది [డున్.
కెప్పుడుబ్రోచెదరో దేవుఁడింతిరో విభు

గీ॥ లేదు ధర్మంబు దైవంబులేదు నిజము
లేదు నాకింక సుఖగతిలేదు జూవె
తెలియ నీకంటె నిక వేరుదిక్కులేదు
లేదులేదమ్మ దేవుఁడులేదు సుమ్మ.

# స్వయంకృతాపరాధము

శ్రీమతి కె. యస్. రాధామణిగారు

సీతమ్మ అప్పుడప్పుడే పురాణశ్రవణాన్నుంచీవచ్చి యింటితాళముతీసి లోపల సంజదీపాలు వెలిగించి హాల్లో పడకకుర్చీలో పడుకొని దీర్ఘంగా ఆలోచిస్తూంది. ఎంత ఆలోచించినా ఆ యాలోచనకు అంతేలేదు. ఇంతలో పొరుగింటిస్నేహితురాలు రుక్మిణమ్మ వచ్చి

"ఏమే! సీతా! యింతపొద్దయింది వంటాగింటా ఏమీ లేకుండాఉన్నావు?"

"ఎంత మహోవంట! యిద్దరికి! అప్పుడే సాయింత్రేచేసిపెట్టే పురాణానికొచ్చింది."

"ఏమి మరి అట్లా యోచిస్తున్నావు."

"ఏమియోచనలా! వినలేదా పురాణం చెప్పుతూన్న బ్రాహ్మడు 'అపుత్రస్యగతిర్నాస్తి' అని వివరించిచెప్పింది. ఏడేండ్లకుపైగాఅయింది కాపురానికొచ్చి యింతవరకూ అభమూలా శుభములా ఏడేండ్లు గర్భిణికానివాండ్లు గొడ్రాళ్లేఅంటారు. దీన్నిగురించే యోచిస్తున్నా."

"అదా సంగతి! అయితే నీభర్తను రెండోపెళ్లి చేసికొమ్మను అప్పుడైనా కలగదేమో."

"అబ్బ నేనుండగానే."

"ఏమీ! ఉండగానే చేసుకునేవాళ్లు లేరా? మనపక్కవీధి రామావధాన్లు రెండోపెళ్లి చేసుకో లేదా రెండోపెళ్లాము లలితమ్మ మగబిడ్డను ప్రసవించలేదా మనకండ్లెదుటనే."

"అయితే నన్నిప్పు డేమి చేయమంటావు."

"ఇంకో సంబంధము యేర్పాటుచేయించు. నీవు ఒప్పుకుంటే నీ మొగుడు వద్దంటాడా! ఇంతకూ నీచెల్లెలు జానకుందికదా ఎదిగింది."

ఇంతలోనే వసారామెట్లపైన యెక్కినట్లు శబ్దము వినపడింది. "మీయజమాన్లు వస్తున్నారు" అని రుక్మిణమ్మ పక్కకుతొలగి వెళ్లిపోయింది.

సీతమ్మ భర్త రామరావు బళ్లారిలో తాలూకకచ్చేరిలో గుమాస్తా. స్కూల్ఫైనలువరకు విద్య చెప్పించినంత తల్లిదండ్రులు గతించారు. అప్పట్లో గుమాస్తాగిరికి చాలా ఖాళీలువుండేవి. అందుకని శీఘ్రంగా రామారావుకు పనిదొరికింది. కొంత వరదక్షిణకూడాయిచ్చి సీతమ్మను పెండ్లిచేసారు. పెండ్లి అయి సీతమ్మ కాపరానికివచ్చినప్పట్నుంచీ రామరావు యింతభూమి కాణీ, యిల్లు సంపాదించుకొని సుఖంగ కాలంగడుపుతూన్నాడు. సంతానంలేదనే కొఱత రామారావునుకూడా బాధిస్తూంది. అయితే భార్యతో యీవిషయం ఆలోచిస్తే తన్నేమనుకుంటుందో అని సిగ్గుపడేవాడు. సీతమ్మ నవనాగరపు పడుచు కాకున్నా అంత ఛాందసురాలుకూడా కాదు. భారత భాగవతాలుపైన అభిరుచియెక్కువ, పూర్వాచారాలంటేకూడా.

సహవాససంబంధాన్నిబట్టి అప్పుడప్పుడు సినీమాలకు వెళ్లేది. పోయినా తెలుగుఫిల్ములకు అందులోనూ పౌరాణికఫిల్ములకే వెళ్లేది. భర్తపైన చాలా ప్రీతీ అనురాగమూ. రామరావు సీతమ్మగార్ల ప్రేమానురాగాలు సీతారాములమాదిరి వుండేవి.

రామరావుకు ఆఫీసునుండీవస్తూనే షికారువెళ్లేది వాడుక. షికారునుండీవస్తూనే భోజనంచేసి సీతమ్మతో తీరికగ కబుర్లుచెప్పుకొనేవాడు. ఆనాడు రాత్రి భోజనముచేసి పడకటింటిలో కుర్చీలోకూర్చొని "గృహలక్ష్మి"లోని శారదలేఖను చదువుకున్నాడు. సీతమ్మకూడా తొందరగ భోజనంచేసి పనిపాట్లుతీర్చుకొని తాంబూలముతట్ట పాల గ్లాసుతీసుకొని గదిలో ప్రవేశించి తట్ట, గ్లాసును టేబిల్ మీదపెట్టి మంచాలమీద పరుపులు విదలించిపరిచి టేబిల్ దగ్గరకొచ్చి తమలపాకుల్లోని ఈనెలుతీస్తూ నిలబడుకుంది. రామరావు లేఖను చదివిన తరువాత "సీతా! నేడు ఏదో ఒకరకముగ ఉన్నావే!" అని సీతమ్మ ముఖమువైపే చూస్తూ పుస్తకాన్ని టేబిల్ మీద పెట్టెను.

"ఏమిచెప్పేది! నలుగురిలోను తలవంపులైనట్లుంది బ్రతుకు!" అని ఆవలకుతిరిగి తమలపాకులకు సున్నము రాస్తూ నిలబడింది.

"అంతపని నేనేమైనా చేశానా! లేక ఎవరికైనా చేశామా! ఎప్పుడూ అనుకోని సంగతితెస్తున్నావే!"

"ఏమిలేదుకాని చాలదా యీ వంధ్యాత్వం."

"అందుకు—"

"అందుకు! అంటారు అందరు! ఏడేండ్లయింది దీనికి బిడ్డలుఅవుతారా అని."

"పోనీలే."

"మీకేమి మిమ్మెవరంటారు నన్నుకదా అనేది."

"ఇప్పుడేమంటావు మరి."

"మీరు ఇంకొక పెండ్లిచేసుకుంటే–"

"నీవా సమ్మతించేదానివి."

"నాచెల్లెలే ఉందికదా! చెల్లెలే గనుక యిద్దరు అన్యోన్యంగాఉంటాము, వేరేఅయితే నేనూ ఒప్పుకొనే దాన్నేనా!"

"నీవు సమ్మతిస్తే అభ్యంతరమేమీలేదు."

"అయితే మావాళ్లకుకూడా వరుణ్ణి వెదకి వెదకి విసుగెత్తింది. ఎవరూలేకుంటే అక్కమొగుడేగతి. నేనొప్పిస్తాను!"

సీతమ్మ చెల్లెలు జానకికి పెండ్లిఅయ్యేవేళకు పదహారేండ్లుంటాయి. ఇన్నాళ్లు వరుడుదొరకక పిల్ల పెరిగింది. అక్కకంటే అందకత్తె. కొంతవరకూ యింగ్లీషుకూడా చదువుకుంది. నవనాగరకతలో అభిరుచియెక్కువ. రామారావుకు యీకాలపుపిల్ల దొరకలేదనే కొఱతతీర్చింది. పెండ్లిఅయిన మూడునెలలకే నిషేకముకూడా అయింది. అక్కచెల్లెండ్రు చాలా అన్యోన్యంగాఉన్నారు. అక్కమాట చెల్లెలు జవదాటకుండా, చెల్లెలు సలహాలు అక్కతీసికొంటూ, భర్తకు చాలా ఆనందాన్నికలిగిస్తూన్నారు. రామరావు ఆఫీసుకార్యాలు చక్కబెట్టుకొని యింటికివస్తూనే షికారువెళ్లేది మానుకొని భార్యలతో ముచ్చట్లు జరుపుకుంటూ సుఖంగాఉండేవాడు.

ఇట్లానందిస్తూండగానే సీతమ్మనోమూ అభీష్టమూ ఫలించిందా అనేట్టు కొన్నాళ్లకు జానకి గర్భము ధరించింది. రామరావు సీతమ్మగార్లు ఆనందంలో పొంగిపోయారు. అయిదో నెలలలోనే అత్తమామలను కావలసిన బంధువర్గాన్ని పిలించుకొని జానకికి సీమంతంచేయించింది సీతమ్మ. జానకి గర్భవతిగనుక పనిపాట్లుచేయించకుండా సీతమ్మ అంతపనీ తానే చేసుకొనేది. అయితే యెంతచెల్లెలేఅయినా సీతమ్మ భర్త ప్రేమ పూర్తిగ చెల్లెలిపైనేపోనీకుండా తానూకూడా అప్పుడప్పుడు వంటచేస్తూఉన్నా, పనిపాట్లుచేస్తూఉన్నా గదిలోనికివచ్చిపోయినా రామరావు జానకి సంభాషణలలో అడ్డుపవాలు చేస్తూండేది.

ఆదినము ఆదివారము. రామరావు యింటిలోనే వుండి గర్భిణీస్త్రీకోరికమీద ఆదినము విందుగ చేసికొని భోజనంచేసి తీరికగకూర్చొని తాంబూలము సీతమ్మ మడిచియిస్తూంటే వేసుకుంటూ కబుర్లుచెప్పు

తూన్నాడు. జానకికూడా ప్రక్కనే తలక్రిందికి చేయి పెట్టుకొని పండుకొని తాంబూలము నములుతూ ఊకొట్టుతూంది. గర్భవతిఅవడము చేత ఊకొట్టుతూ, ఊకొట్టుతూనే అట్లేనిద్రపోయింది. గర్భవతిగనుకనూ, పండుగభోజనంచేతనైన ఆయాసముచేతనూ బుస్సుబుస్సుఅని గొరకలు పెటుతూంటే ముఖమంతా చెమటలుపోసి, ఆ చామనిచాయముఖము తామరమీద నీటిబిందువులమాదిరి కనిపిస్తున్నాయి. కొంతసేపటికి ఆ చెమటబొట్లు ప్రవహించడానికి మొదలుపెట్టినాయి. రామరావు జానకి ముఖముతట్టుచూచి పడకకూర్చీనుండీ దిగివచ్చి "అయ్యో! నిద్రించుటకూడా గర్భవతులకు ఆయాసమూ — కష్టమూనా!" అని తన, ముఖములో ఆనందము అంకురిస్తూంటే పైనున్న వల్లెతో ప్రేమార్ద్రపుదృష్టులతో ముఖముతట్టు చూస్తూ చెమటనుతుడిచి అట్టే కొంచెసేపు విసరాడు.

ఈసన్నివేశం కొంతవరకూ సీతమ్మహృదయములో అసూయాబీజములు నాటింది. ఎంత అక్కచెల్లెండ్రయినప్పటికీ — సవతులుకదా! అత్తకోడండ్రు — సవతులూ — సవతితల్లులూ — అసూయాగ్రస్తలేకదా! ఒకప్పుడుగాకుంటే ఒకప్పుడన్నా వారిమనసుల్లో ఈర్ష్యపుట్టకపోదు. ఓర్పుకలవాళ్లు కొంతవఱకు లక్ష్యంచేయరు. అదిలేనివాళ్లు ప్రతీకారాన్ని చేయవలెనని వెంటనే యోజిస్తారు. అనుకొన్నంతపని చేసేవరకు వారిమనస్సొప్పదు.

రామరావు జానకిముఖముపై చెమటనుతుడిచినప్పట్నుంచి సీతమ్మకుపుట్టింది పుట్టరాని తెగులు. "అపుత్రస్యగతిర్నాస్తి" అను పరలోకచింతపోయి "తనగతేమి" అనే యిహలోకచింత యెక్కువ బాధించింది. "కొడుకు కలగకనే యింత ప్రేమ పక్షపాతము చూపేవాడు కొడుకు కలిగితే యింకెంత జాస్తిచేస్తాడో, అప్పట్లో సవతితల్లి స్వంతతల్లి అవుతుందా! గొడ్రాలిమీద ప్రేమవుంటుందా అయనకు, పిల్లవాని ముచ్చట్లలో మురిసిపోయి పిల్లతల్లినే ప్రేమిస్తాడు కాని నన్ను మాట్లాడిస్తాడా! భర్తప్రేమనంతా తానే చూరగొన్నానని గర్వించి అది నన్ను దాసిగాచేస్తుంది. కాబట్టి యేదైనా గట్టిగ ఆలోచిస్తేనేగాని మార్గంలేదు" అని వితర్కించుకొని సీతమ్మ మనసులో ఆందోళన యెక్కువైపోయింది. గర్భస్థశిశువును అంతమొందిస్తేనేగాని మనశ్శాంతి కల్గేటట్టులేదు. అందుకోసరము జానకికి బాధకలిగిస్తేనేగాని గర్భస్థశిశువు చావదు. తానుచేసేకార్యము యెవరికిన్ని తెలియకూడదు. పైగా భర్తమీద జానకిమీద యేకరీతిగ ప్రేమ అభినయిస్తూ ఉండవలెను.

ఆలోచనచేయగా చేయగా ఒకటితట్టింది. గర్భవిచ్ఛిత్తుచేసే ఔషధాలున్నాయని అప్పుడప్పుడు వినింది. అయితే అవి సీతమ్మకు దొరకేదెట్లా. ఎప్పుడూ ఒంటరిగా ఊరిలోనికిపోని సీతమ్మ ఆ దినము జానకి యింటిలోనిద్రపోతూంటే తెగించి, రామమ్మఅనే ఆవూళ్లోని వంటలక్కయింటికివెళ్లింది. రామమ్మ గర్భవిచ్ఛిత్తులకు మందులు విరుగుళ్లు తయారుచేసిపెట్టి గుట్టుగయిచ్చేదని పుకారు. తన చేతిలోని బంగారుగాజుతీసి రామమ్మచేతిలోపెట్టి సంగతంతా చెప్పుకొంది. రామమ్మ లోపలినుంచి ఏదో భస్మంమాదిరి పొడితెచ్చి సీతమ్మకుయిచ్చి "ఇది దేన్లోనయినా కలిపి నీసామర్థ్యంకొద్దీ తినిపించేయి" అని పంపివేసింది. సీతమ్మ యింటికొచ్చి మధ్యాహ్నం టిఫన్‌కుగాను లాడు చేసింది. మగడువచ్చేవేళకు పొద్దవుతుందనిచెప్పి జానకికి రెండు లడ్డూలిచ్చి తినమనింది. దాన్లోకలిపేసింది రామమ్మ యిచ్చినమందు.

రాత్రి ఏడుగంటలప్పుడు జానకి భోజనమువద్దని ఓవల్టిన్ తాగి యీజీచేర్లోకూర్చొని యేమోచదువుకుంటూంది. సీతమ్మ యింటిలోపల వంటపని చేసుకుంటూంది. అప్పుడప్పుడూ జానకివైఖరితొంగిచూస్తూంది. రామరావుకూడా షికారునుండివచ్చి డ్రెస్ తీసేసి




బాపట్లతాలూకా ద్వితీయ మహిళా సమావేశ సమయమున దీయబడిన ఛాయాచిత్రము.
ప్రథమ గృహలక్ష్మీకంకణ గృహీతలు శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

# గృహలక్ష్మీ కంకణ గృహీతలు



శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు

1935



శ్రీమతి విద్వత్ కవితిలక

కంచనపల్లి కనకాంబగారు

1936



శ్రీమతి కవితిలక పులవర్తి

కమలావతీదేవిగారు

1937

కాళ్లూ చేతులూ కడుక్కొని సీతమ్మను మాట్లాడించి జానకికెదురుగ టేబిల్ వద్ద కుర్చీలో కూర్చొని కబుర్లు చెప్పడానికని "జానకీ" అని పిలిచాడు. ఆవేళకు రామమ్మ యిచ్చినమందు పని చేయడం ప్రారంభించింది. జానకీ అని పిలిచినపిలుపు రెండుమూడుమార్లు అనివా వినిపించుకోలేదు. రామరావు కుర్చీనుండీ లేచి యీజీఛేర్ దగ్గరకొచ్చి తొంగిచూచాడు. పలకలేదు. జానకికి కండ్లు పైకిపోయినవి. కడుపులో నుసట మెత్తింది. జానకీజానకీ అంటూ పొర్లించి పలకరించాడు రామరావు, పలుకలేదు. రామరావు దిక్కు తెలియక "సీతా" అని అరచాడు. ఆ అరుపువింటూనే సీతమ్మ ఉలికిపడి లేచి పరుగెత్తివచ్చింది. జానకి పడక కుర్చీ నుండి లేచి యేమేమో సన్నిపాతరోగిమాదిరి పదురుతూ సంకటము, సంకటము, అని అరుస్తూ కడుపు గుద్దుకోవడం ప్రారంభించింది. సీతమ్మ కూడా భర్తతో పాటి నిర్ఘాంతపోయి చూస్తూంది. ఒకరితో ఒకరు మాట్లాడకుండా అట్లే చూస్తున్నారు. "అయ్యో! ఇంకేమిగతి అన్యాయము, అన్యాయము" అని అప్రయత్నంగా సీతమ్మనోటినుండి మాటలు వస్తున్నాయి. రామరావు యేమితోచక కొయ్యవలె నిలబడిపోయినాడు. ఇంతకు ముందెప్పుడు కనివినిఎరుగని జానకిబాధ తనకేమియు బోధపడడము లేదు. చికిత్సచేయుడానికి చేయించడానికి తోచలేదు. సీతమ్మ మాత్రం తొందరగా యింత పానకంచేసి నిమ్మపండుపిండి యిచ్చింది. బాధ తగ్గడంలేదు కాని హెచ్చింది. ప్రాణి గిజగిజ తన్నుకొంటూంది.

ఈదృశ్యాన్ని చూసేవేళకు సీతమ్మ మనోవైఖరి మారింది. పశ్చాత్తాపం ప్రారంభమయింది. తన అకృత్యాన్ని లోలోన నిందించుకుంది. సహోదరికదా! ఏకోదరత్వ సంబంధమూ అనురాగమూ యెన్నటికైనా పోతుందా. ఇంతకూ సీతమ్మకుపుట్టిన అసూయ అనాదిగ సంప్రాప్తించింది కాదు. స్వల్పకాలంలోనే పుట్టి కార్యరూపందాల్చింది. జానకిపడే అవస్థలుచూచి సహించలేకపోయింది. "ఇదేమో గ్రహసంబంధమున్నట్టుంది మంత్రమన్నా వేయించుకొస్తా" అని రామరావుతో చెప్పిన దవసరం బిరబిర బజారులోపడి అతివేగంగా రామమ్మ యిల్లుచేరింది. సీతమ్మ తన రెండో చేతులోని గాజులపీకి రామమ్మ చేతిలో పెట్టి "అమ్మా నీపుణ్యము అవస్థచూడలేనమ్మా. పహ్యా నీమందుకు విరుగుడయితే నీపుణ్యము" అని దీనంగా ప్రార్థించింది. రామమ్మ తన అదృష్టానికి సంతసిస్తూ లోపలి నుంచీ మరొకపొట్లము తెచ్చి "దీన్ని నీళ్లలో కలిపి త్రాగించు" అని యిచ్చింది. సీతమ్మ యింటికివచ్చి మందుపొట్లము నీళ్లలో వేసి మంత్రమునీళ్లని తాగించింది. కొంచెముసేపటికి జానకిశరీరమంతా చెమట్లు పోసి ఉస్సురుమనింది. అట్లే కొంచెంకొంచెం తగ్గుతూవచ్చింది. సీతమ్మప్రాణం కొంతకుదుటపడింది. వెంటనే వంటింట్లోకిపోయి స్టవ్వులో వేడిగ ఓవల్టిన్ చేసియిచ్చింది. జానకి కొంచెంతాగి "అబ్బా" అని కొంచెంసేపు అట్లేనిద్రపోయింది. నిద్రనుండి లేవగానే సీతమ్మ వేడినీళ్లతో స్నానంచేయించి భోజనంపెట్టింది. అప్పటికి బాధ ఉపశమించింది. తాము భోజనం చేసారు.

అప్పట్నుంచీ సీతమ్మ హృదయంలో దురభిప్రాయాలకుగాని రామరావుపై ప్రేమ పక్షపాతాన్ని ఆరోపించడము కాని లేకుండా కాలముగడుతూ ఉంది. ఒకనాడు రామరావు భోజనముచేసి పడక కుర్చీలో కూర్చొనిఉండగ కుర్చీప్రక్కన సీతమ్మ కూర్చొని ఆకులు మడతపెట్టియిస్తూంది. హఠాత్తుగ రామరావుకు ఆకు అందిస్తూన్న చేతివైపు దృష్టిమళ్లింది "సీతా గాజుల్లో ఒకటిలేదే" అని ప్రశ్నించాడు. "అకస్మాత్తుగ ఒకటివిరిగిపోయింది దాన్నితీసి పెట్లో పెట్టినాను" అని బదులుచెప్పింది. "సరే" అని రామరావు యేవో మాటలు ఆరంభించాడు.

ఆదినం మూడో శనివారము – శలవు. రామరావు యింటిలోనే ఉన్నాడు. ఏదో జ్ఞాపకంవచ్చి

"సీతా నీవిరిగిపోయినగాజు యిక్కడతీసుకొనిరా! సరిచేయించుకొవస్తాను ఈదినం సెలవు తీరికఉంది" అని సీతమ్మనుపిలిచిఆడిగాడు. సీతమ్మ యీతూరి శోక కారణం చెప్పి తప్పించుకోలేకపోయింది. సీతమ్మ తనఅకృత్యాన్ని మగనితో చెప్పవలెనని యెన్నోసార్లుప్రయత్నించి నోరురాక ఊరకుంది. ఇప్పుడు భర్తకు ప్రత్యుత్తరమిచ్చేందుకు తోచక చిక్కుంది. భోరునఏడ్చింది. రామరావుకేమిన్నీ అర్థంకాలేదు. జానకినన్నా అడుగుదామంటే గదిలోపండుకొంది. సీతమ్మ రెండుచేతుల్లోను ముఖం దాచుకొని రామరావుఒళ్లోపడి యేడుస్తోంది. తల యెత్తి రామరావు శోకకారణాన్ని ప్రశ్నించాడు. రామరావు తనవళ్లలో సీతమ్మ కన్నీళ్లుతుడుస్తూంటే మొదలుపెట్టింది కథ. ఆద్యంతము పూసగ్రుచ్చినట్లు తన అకృత్యాన్నిగురించి చెప్పింది. "క్షమించరా" అని వేడుకుంది.

"అంతయు స్వయంకృతాపరాధమే" అనినవ్వుతూ "ఆదినం నీవు కొంచెము ఆలస్యంచేసివుంటే యేమై ఉండునో తెలిసిందా, క్షమించితిని లెమ్మ" అని రామరావు చేరదీసాడు.

ఇంతలో నిద్రనుండి మేల్కొని వచ్చిన జానకిని చూచి అక్కసంగతంతా చెప్పేవేళకు జానకికూడా ఫక్కుననవ్వి "స్వయకృతాపరాధమే కదా!" అని రామరావుఅనినదాన్నే సమర్థించింది. సీతమ్మ అవమానంతో తలవంచుకొని కాలిబొటనవేలితో నేల రాచింది.

—:o:—

# చందమామ

కల్లబొల్లి మాటలాడితె
ఒళ్లుమరచే వెర్రిబాగుల
చందమామా! నిన్నుజూస్తే
జాలివేస్తుందీ!!

"ఎందుఎరుగని అందగాడవు
చందమామా భేషు!" అంటూ
దొంగకవులూ పొగడిపోస్తే
పొంగిపోతావా?

కడలిబాబాయ్ కనికరించిన
తీపిపంటల వెన్నెసోనల
దొంగకవులా దోచుకుంటూ
దొరలనిస్తావా?

'చెలిమిచేస్తా'నంటు జేరే
చిలిపికవులకు మోసపోయీ
దొప్పదోగగ దోరవెన్నెల
దోచిపెడతావా?

దోచుకొన్నా దొంగసొమ్మును
దొరలలాగా మ్రింగుతుంటే
ఊటలూరే కోటినాల్కల
లొట్టలేస్తావా?

పడకటింటీ ఉడుకునంతా
పైనరద్దీ తిట్టిపోసే
దొంగకవులా దోషమంతా
తోసివేస్తావా?

కల్లబొల్లి మాటలాడితె
ఒళ్లుమరచే వెర్రిబాగుల
చందమామా! నిన్నుజూస్తే
జాలివేస్తుందీ!!

పిసపాల వేంకటేశ్వరరావు.

# ఆడమళయాళము

శ్రీ

శ్రీ అనుముల వెంకటశేషకవిగారు

మళయాళ దేశం సంగతి చెప్పితే మనవారు ఓహో! స్త్రీమళయాళమా? అంటారు. ఈ దేశంతోపాటు స్త్రీజాతి కింత ప్రసిద్ధి యెందుకు కలిగిందో ఆలోచించేవారు అరుదు స్త్రీజాతి సామాజిక, ఆర్థిక విషయములలో ఆ దేశమందు ఆక్రమించిన స్థానం—ఆ దేశంలో స్త్రీలపైన జనులకుండే అభిమానగౌరవాలు ఇంకే దేశంలోనూ లేవు. ఆ దేశీయులు సంఘములో స్త్రీలకు అగ్రస్థాన మిస్తారు. అందుకే స్త్రీమళయాళ మయింది.

మలబారుదేశం ప్రకృతి సౌందర్యానికి పుట్టినిల్లు. గాంధీజీవంటివాడుకూడా "యీ పిల్లలను చూస్తే నాకు ప్రేమ కలుగుతూంది" అన్నాడు. ఆంధ్రుల ప్రాచీన విజయనగర సామ్రాజ్యంకంటేనూ ఎన్నోరెట్లు హెచ్చు సౌందర్యంలో మన మా దేశమందు ఓలలాడవచ్చు. ఒకప్రక్క పశ్చిమాంబుధి నీలతరంగాలు. ఇంకోప్రక్క పొడుగైన సహ్యాద్రిశ్రేణి. ఆ నడుమ మనోహర వనప్రదేశాల్లో అమర్చబడినట్లున్న సరోవరాలు, సెలయేళ్లు, పగలు సూర్యప్రభా, రాత్రి చంద్రప్రభా మనల మోహింప చేస్తుంటాయి.

## పరశురామ క్షేత్రము

మలయాళదేశ నిర్మాణాన్ని గురించిన కథ లెన్నో ఉన్నాయి. అందులో సుప్రసిద్ధమయింది పరశురాముని కథ. పరశురాముడు క్షత్రియుల సంహారం చేసి, భారతదేశాన్నంతా బ్రాహ్మణులకు దానంచేసి, అక్కడ నిలిస్తే దత్తాపహారమౌతుందనే భయంతో సహ్యాద్రినెక్కి, పొంగిపోతూన్న పశ్చిమసముద్రాన్ని బాణాలతో నిర్జించి దూరంగాపంపి, అంతకుముందా సముద్రం డాక్రమించిన ప్రదేశాన్ని ఆక్రమించుకున్నాడట! అదే పరశురామ క్షేత్రమనే మలయాళం. ఈ ప్రతీతి ఎంతనిజమో కాని, యిప్పటికీ మలయాళదేశంలో మాత్రం పరశురామపూజ విశేషంగా జరుగుతూంటుంది.

ఈ మలయాళ రాజ్యాన్ని మూడు భాగాలుగా విభజింపవచ్చు. బ్రిటిష్‌సామ్రాజ్యానికి చేరిన భాగమొకటీ, తిరువాన్కూరు సంస్థాన మొకటీ, కొచ్చిను సంస్థానం మూడోది. ఈ రెండు సంస్థానాలూ పురాతనమైనవి. అవే యీ స్త్రీమలయాళపు సాంప్రదాయాలు సూచించే ప్రధానస్థానాలు. ఈ రెండు సంస్థానాల రాజకుటుంబాల్లోనూ ఉత్తరాధికారుల నిర్ణయాలు విచిత్రంగా ఉంటాయి.

## మరమ్మక్కతాయం

మనకు వీరి "మరమ్మక్కతాయం" అను పద్ధతి చిత్రంగానే కనబడుతుంది. దానికే "సోదరీ సంతాన పద్ధతి" అని మనం అనుకోవచ్చు. తలతిరుగుడుగా మనకు కనిపించే యీపద్ధతి యేమిటంటే:—మనలో ఆస్తికి ఉత్తరాధికారం తండ్రి తరువాత కొడుకులు వహిస్తారు. అయితే యీ "మరమ్మక్కతాయం" ప్రకారం తండ్రి సోదరికి పుట్టిన బిడ్డలకే ఉత్తరాధికారం. ఈ వింతయేర్పాటుకు యిప్పటి తిరువాన్కూరు రాజకుటుంబాన్ని ఉదాహరణంగా తీసుకొని చూదాం.

ఇప్పటి తిరువాన్కూరు మహారాజా శ్రీ చిత్ర తిరునాళ్ గారు 1931 సం|| నవంబరులో సింహాసనం అధిరోహించారు. వీరికిముందు మహారాజాగావున్న శ్రీమూలంగారికి వివాహంజరిగి యిద్దరు కొడుకులు కూడా పుట్టారు. మన పద్ధతిప్రకారమైతే వాళ్లలో పెద్దవానికే రాజ్యాభిషేకం జరగాలిసింది. కాని, మరమ్మక్కతాయాన్ని అనుసరించి వారి కిప్పుడు రాజ్యంలేదు. వారి సోదరిప్రక్కవారికే రాజ్యాధికారం. పాపం! ఆ పూర్వపు మహారాజుకు సోదరి

లేకపోయింది. అప్పుడు తమ తమ్ముని జ్ఞాతులైన యిద్దరు పిల్లలను మేనకోడండ్రుగా దత్తు తీసుకున్నారు. వారిద్దఱిలో మొదటపుట్టిన కొడుకును రాజ్యాధికారం లభించే పద్ధతిగా నిర్ధారణచేసి పెద్ద మహారాణీ, చిన్నమహారాణీలుగా ప్రకటిస్తే యిప్పుడు చిన్నరాణీగారైన సేతు పార్వతీబాయిగారి తొలి కొడుక్కే రాజ్యం వచ్చింది.

## శాపానుగ్రహాలు

మైసూరు రాజవంశంలో సంతతి భార్యలకు అలమేలమ్మ శాపమెలాంటిదో, అలా తిరువాన్కూరు రాజవంశానికిలాంటి విచారంలో ఒక ఐతిహ్యముంది. తిరువాన్కూరు రాజులకు ఉత్తరాధికారు లుద్భవించేది సోదరి గర్భంలో కదా. సామాన్యంగా యీ సోదరి ఉండేకే వారిలో అరుదు. అందుచేత వారు మేనకోడండ్రనో, చెల్లెండ్రనో దత్తు తీసుకుంటూ ఉంటారు. ఇందుకు కారణమేమంటే:—మలబారు నిర్మాతయైన పరశురాముడు తిరువాన్కూరు, కొచ్చిను దేశాల రాజులకు ప్రత్యక్షమై, "మీకు సంతానమా? భాగ్యమా? ఏది కావాలి?" అని అడిగితే, కొచ్చినువారు సంతానాన్నీ, తిరువాన్కూరువారు భాగ్యాన్నీ కోరుకున్నారట. ఈకథ నిజమని నమ్మేట్టుగానే కొచ్చినువారికి సంతానం సముద్రం మోస్తరు పెరిగిపోతూంది. తిరువాన్కూరువారికి భాగ్యం అమితంగానూవుంది.

## నాయర్ కుటుంబాలు

ఈ పైనిచెప్పిన "మరుమక్కతాయం" పద్ధతి యీ మలయాళ దేశంలో రావటానికి మూలం నాయరు కుటుంబాలుగానే తోస్తుంది. పూర్వమెప్పుడో అక్కడి పరిస్థితులు తారుమారుగా ఉండటంవల్లనే యీపద్ధతి ఏర్పడిందని ఇ. ఎ. వార్గిస్ గారభిప్రాయపడినారు. మలయాళదేశం భిన్నభిన్నములై చిన్నచిన్న పాళెగాండ్రకు లోబడి ఉన్న కాలంలో పరస్పరకలహాలవల్ల వారివారి స్వతంత్ర ప్రదేశాలు రక్షించుకునే భారం శూరులైన నాయరు వంశాలపై బడింది. కాలాకాల విచారాలు లేకుండా ఎల్లప్పుడూ కత్తిబట్టి పోరుకు నిలవటమే వారి కలవాటయింది. ఇలాంటి సందర్భాల్లో ఇల్లూ, వాకిలీ, ఆలూ, బిడ్డలూ ఉన్నవాళ్లు యుద్ధానికి వెనుకంజ వేస్తూండేవారు. అందుకోసం యోధులకు యీ బంధాలే పనికిరావని నిర్ణయించుకున్నారు. అయినా ఆ కాలంలో సుందరీజనమంతా వీరపురుషుల సొత్తు. అలా కావటం మూలాన్ని ఆ కాంతలసంతానానికి తండ్రులెవరో తెలుసుకోవటం కష్టసాధ్యమైపోయింది. కాబట్టి ఆడుపిల్లలు పుట్టినిండ్లలోనే ఉండటం. వారి సంతానమే మామగారి ఆస్తికి ఉత్తరాధికారులు కావటం అలవాటయిపోయింది. ఇప్పటికీ మళయాళంలోని కన్యలు వివాహానంతరంకూడా పుట్టింటనే ఉంటారు. వారి భర్తలు వేఱే కాపురాలుండి, రాత్రిళ్లుమాత్రం పడుకోడానికి పెళ్లాలదగ్గఱికి పోతారు. ఎంతమంది బిడ్డలు పుట్టినా, వారంతా పుట్టింటనే తల్లితోగూడా ఉంటారు. ఏవన్నా ప్రోనోట్లు, మొదలైన వ్యవహారాల్లోగూడా మళయాళస్త్రీలు "పలానావాని చెల్లెలు, లేక అక్క" అనే వక్కాణం వ్రాస్తారు. అంతేగాని తండ్రి సంగతి అనుకునేవారే ఉండరు.

## మహారాజుల శుద్ధి

మళయాళము ప్రాచీన సాంప్రదాయాల పుట్ట. అందువల్ల క్షత్రియులకే రాజ్యాధికారార్హత. అయితే తిరువాన్కూరు రాజులు శూద్రులు. కాబట్టి వారికోసం ఒక శుద్ధిక్రమం ఏర్పాటయింది. అది రాజులకు కర్చుపద్దే కాని కష్టమయింది కాదు. ఈ పద్ధతి ననుసరించి మహారాజు బంగారురేకుతో ఒక పశువును చేయిస్తాడు. బ్రాహ్మణుల మంత్రఘోష జరుగుతుంది. ఆ మహారాజు పశువునోట్లోదూరి తోక నుంచి బయటబడతాడు. తరువాత యజ్ఞోపవీతం వేసి

మహారాజును ద్విజునిగా మారుస్తారు. ఆ మార్చిన బ్రాహ్మణులకు పశువు దానంగా యీయబడుతుంది.

## నంబూద్రి–నాయరు వివాహాలు

హిందూధర్మం అంతర్జాతీయవివాహాలకు చుక్కెదురు కదా? పూర్వాచారపరాయణతకు ప్రసిద్ధి జెందిన మలబారులో యిప్పటికీ ఏతద్విరుద్ధసాంప్రదాయాను సారంగా వివాహాలు జరుగుతాయి. అందుకు నంబూద్రి నాయరు వివాహాలే ప్రబల సాక్ష్యాలు. నంబూద్రీలు మళయాళదేశపు స్వచ్ఛమైన బ్రాహ్మణులు, ఆర్యవంశీయులు. నాయర్లు శూద్రులు, అయ్యేను నంబూద్రీలలో పెద్దవాడు మాత్రం తన వంశీయురాలైన కన్యకను వివాహమాడుతాడు. తక్కినవారంతా నాయరు పిల్లలనే చేసుకుంటారు.

## నాగలోకము

శృంగార సౌందర్యవిభ్రమాలకు నాగకన్యలు మనలో ప్రసిద్ధి. మళయాళాన్ని ప్రత్యక్షనాగలోకంగానే మనం తలంచవచ్చు. కేవల కన్యకల సౌందర్యాన్నిబట్టే కాకుండా, ఆదేశంలో పాములుగూడా అమితం కావటం మూలాన్ని ఆపేరు చెల్లుతుంది. ఇంతగా పాముల చెలగాటాలున్నా అక్కడ జనులకు నాగులపై భక్తి యెక్కువ, నాగపూజ విశేషంగా జరుగుతుంది. ప్రతిపల్లెలోనూ నాగశిలలుంటాయి. ఇంటింటికీ నాగుల దేవాలయాలున్న కుటుంబాలు ప్రబలం. ప్రతివాడూ తన భూస్థితిలో ఒకమూలను నాగగుడి కట్టించే ఉంటాడు. పురాతనమైన యీ గుళ్లల్లో చుట్టూ పుట్టలు పెరిగిపోయి నిజమైన నాగులు నివసిస్తుంటాయి. అయినా యీగుళ్లల్లో పూజలుమాత్రం యీరోజుకూ తప్పగూడదు. పాములను చంపడంగానీ, వాటి పుట్టలను నాశనం చేయడంగానీ ఆ దేశస్థులు మహాపాపంగా పరిగణిస్తారు. అలా చేసినవాడికి తప్పకుండా అంధత్వమో, అపస్మారమో సంభవిస్తుందని భావిస్తారు. అనివార్యంగా పాము చస్తే దానికి మృతసన్యాసి కళేబరానికి మోస్తరుగా సమాధి కట్టిస్తారు.

ఇంకో చిత్రం: నంబూద్రి పురోహితులు కొందతే పాములను భయంలేకుండా పట్టుకొని, సీసాల్లో పెట్టి, యిండ్లకు తీసుకుపోయి పోషిస్తారు. అందుకే వారి యిండ్లకు (పాంబుం మిక్కడ్) సర్ప సంరక్షణాలయము అను అన్వర్థనామధేయం కలిగింది. ఆ యిండ్లలో పాములు నిర్బంధంలేకుండా, విశృంఖలంగా తిరుగుతుంటాయి. ఎవ్వరినీ కఱవవు. హాయిగా ఆడుకుంటూ అవి సామానులకు కాపలా కాస్తాయట! ఎవరన్నా పరాయివారు ఆ సామాను తీసుకోబోతే అడ్డంగానిలిచి ఆపుతాయటకూడాను! ఆ సామాను క్రింద పారవేస్తే దారి విడుస్తాయట. కాని కఱవటం తేనేలేదు.

అలాంటి నాగులమీది భక్తితోనే అచ్చటి స్త్రీలూ, పురుషులూ శిరోజాలను నాగుబాము పడగలవలె ఉంచుకోవటం శృంగారంగా తలుస్తారు.

విషవైద్యంలోగూడా మళయాళదేశం పైచేయిగానే ఉంది.

## నూతన సంస్కారాలు

పై పద్ధతులన్నీ ఇప్పటికీ ఆచరణలోఉన్నా, నూతన సంస్కారాలు బయలుదేరే సూచనలు మళయాళంలో పొడచూపుతున్నాయి. జాతికట్టుబాట్లు సడలిపోతున్నాయి. కూతవేటుదూరంలోఉండి పలుకవలసిన హరిజను లిప్పుడు దగ్గరగా వస్తున్నారు. ఇందుకు తిరువాన్కూరు మహారాజు హరిజనప్రవేశానికి దేవాలయాలన్నీ తెఱపించడమే సాక్షి.

ఐనను స్త్రీ ప్రాశస్త్యం ఆదేశంలో అలాగే ఉన్నది. స్త్రీవిద్య ఆదేశంలో మోస్తరింకే దేశంలోనూ అభివృద్ధిలోలేదు. కాని, స్త్రీలు తమ పూర్వాచారాలు మార్చుకునే సూచనలు మాత్రం కాన్పించవు.

—ప్రజాబంధు.

# ఉత్తమాదర్శులు

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

ఆదర్శకారులనగా, ఇతరులకు తమవలె నడచుకొనుటయందు మార్గము చూపించువారు. ఉత్తమాదర్శులనగా ఆదర్శులలోను, ఎక్కువగా నొక ఉన్నతగుణముతో కూడినవారు. ఈమధ్య పీఠాధిపతులగు, స్వాములు సంచారప్రబోధములు సల్పుచు మానవలోకమున కాదర్శసుగుణములతో నొప్పుచు మహారాజుల సహితము పాదాక్రాంతులగా జేయు మహానుభావత్వములో ప్రసిద్ధిజెంది, తానుపయోగించకపోయినను ప్రజాసముదాయముచేతను గురు పీఠాధిపత్యమువలనను సంక్రమించిన గజాశ్వగోవృషభ ధనధాన్య పరివార జంఝూటనముతోకూడి తద్రక్షణార్థ మేర్పరుపబడిన ఆయుధసమేత బాడీగార్డులతోను, కూడినవారికి తగినభోజన వసతులతోను సర్కసుకంపెనీలమాదిరి యూరూర సంచారముసల్పుచు నిర్ణయ పాదపూజాదికద్రవ్య సంపాదితులై లోకముతో పని లేని సర్వసంగపరిత్యాగిగా యోగాభ్యాసావకాశములేని బహుళపూజాడంబరులై లోకోద్ధరణలన్న నామమే ధరించినను నీమములనేకములచే సకల జనోద్ధరణ సేయక సర్వజనసన్మానములు బడయనేరని పీఠాధిపతులొక తెగగాగలరు.

ఇంక బాల్యమునుండియే సహజోద్భవ లోకోద్ధరణ కార్యదీక్షత్వహృదయముచే బ్రహ్మచారులై నిజసౌఖ్యముల విసర్జించి సంప్రాప్తికాహారభక్షకులై నిద్రాసౌఖ్య వర్జితులై భగవద్భక్తులుగా కూడిన ఆశ్రితులను, జాతిమత వివక్షతానియమాదికముల బూనక "పరోపకారార్థమిదం శరీరమ్మను" ఆర్యవచనానుసారము ఆసేతు హిమాచల పర్యంతమును సంచరించుచు నల్దిక్కులను తమ సహజ శాంత సాత్వికానర్గళధారా ప్రబోధవాక్యాకర్షిణ సందర్భితశిష్య సముదాయముచే లోకోద్ధరణ మహానుభావుత్వ పదవీ స్వీకరుణులై, జగత్ శాంతికారకులై, అహంకారమమకార ఆశారహితులై మనస్సన్యాసులై, సాత్వికస్వభావ శాంతిమూర్తులై, భక్తిహృదయులై, మతకక్షలచే కొట్లాడు సమయావిర్భూత అవతారమూర్తులై, సక్రమమానవవర్ణ నిర్మితులై, శాశ్వత యశఃకాములై, మూలపీఠాస్థాపనాచార్య బిరుదాంకితులగు దత్తాత్రేయ శంకరాచార్య శుక సనందాదులవంటి సర్వసంగ పరిత్యాగ మనస్సన్యాసు లొక తెగగాగలరు.

మఱియు మాయామానవజనితులయ్యు పూర్వజన్మపుణ్య సంస్కారవశంబున అగర్భ శ్రీమంతులయ్యు స్వార్థత్యాగులై గృహస్థ సౌఖ్యములపొందియు మనోలంపటావిముఖులై నిజదారసుతమిత్ర పరివారబాంధవ గృహక్షేత్రబంధితులయ్యును దేశమానవ

# మా విషాద చరిత్ర

శ్రీ బులుసు సీతారామశాస్త్రిగారు

విషాదపూరితమైన మాజీవితము పాఠకుల హృత్ఫలకముల నెదుటనుంచి, వారిని వ్యాకులపరచుట మా యుద్దేశము కాదు. మేము ప్రస్తుతము సంఘదౌర్జన్యమునకుఁ బాల్పడి, యనుభవింపరాని కష్టములఁ దగుల్కొని, వానినుండి విముక్తిఁ జెందుమార్గముఁ దెలియకేరక, మాపరిస్థితులు సోదరీసోదరులకు, విన్నవించుకొనినచో, మమ్ము నీవిషాదసాగరమునుండి వారు దరిఁజేర్ప గల్గినను, లేకపోయినను, భావిపౌరులై, తమ యసాధారణప్రజ్ఞలచే, దేశమునకు విఖ్యాతి గూర్ప వలయు తమ బాలబాలికల మేమనుభవించు పరిస్థితులలోఁ బడకుండఁ గాపాడుకొనగలరను నభిప్రాయముతో నీపనికిఁ గడంగితిమి. నేఁడు మావలె నిరాశాసంతప్తహృదయములతోఁ గ్రాఁగి, కృశించిపోవుచున్న సోదరీసోదరు లింకను గొందఱు గలరని మేమెఱుఁగుదుము. వారికష్టముల నివారించుటకు, సదయహృదయులగు మహానుభావులు, గొందఱనేకవిధములఁ బ్రయత్నించుచుండిరనియుఁ దెలియుచున్నది. అట్టివారి కటాక్షవీక్షణము లే కొలఁదిమంది యనాథలమీఁదనో ప్రసరించినంతమాత్రమున సనాథలము ననాథలమునగు మేమెట్లు తృప్తిఁగాంచగలుగుదుము? కీర్తికాంక్షాదినతోఁదనే యౌదాసీన్యము వహింపక, యుందలివిషయములన్నియు, సావధానముగఁ బరిశీలించి, యస్మాదృశుల ఘోరాంధకార జీవితములకుఁ బవిత్ర స్వేచ్ఛానందరశ్మి కన్పట్టు ప్రయత్నములే కొందఱైనియుఁ జేయకపోరని మాదృఢవిశ్వాసము. మాసంఘమునఁ బ్రస్తుతమైదార్గురము మాత్రమే యుంటిమి. మాసంగతులు మేము ప్రత్యక్షముగ లోకమునకుఁ దెలియఁజేసికొనుట కనేకయవాంతరములుగలవు. మాలో గొందఱీ యీవిధముగఁ బ్రతికియుండినఁ దమచరిత్ర వెల్లడించుట కంగీకరించిరి. ప్రస్తుతము వారిచరిత్ర లొకొక్కటే ప్రకటింతును. మిగిలినవారుఁ దమ చరిత్ర మావలెఁ బ్రకటించుట కంగీకరించినఁ గ్రమముగ నవియు ముందుముందు ప్రకటించెదను. నాకు మాఅందఱివిషయముఁ బూర్తిగఁ దెలియును. మున్ముందు మాకష్టవిషయము వ్రాయగలను.

రామనాథుఁడు సాధుశీలుఁడు. దైవభక్తి గల వాఁడు, మహావిద్వాంసుఁడు గాకపోయినను, విద్యాగంధవిహీనుఁడు గాడు. ఏవిషయము వచ్చిన మిక్కిలి వెఱ్ఱిపట్టుదలవాడు, సాంఘికనియమములభక్తి యను దాస్యమునకుఁ బట్టుగొమ్మ. సామాన్యమైన భూవసతి గలిగి, గౌరవముగ నలుగురిలోఁ దలయెత్తుకొని, జీవించువాఁడు. అతనికి ముగ్గురు కుమారులును, ముగ్గురాడుబిడ్డలుఁ గలరు. వారిలోఁ గడగొట్టు బిడ్డయే కమల. ఆమె చిన్నదనమునుండియు, గనిష్ఠ సంతానమగుటఁ, దలిదండ్రులచే మిగుల గారాబముగఁ బెంపబడెను. ఆమెసోదరులు ముగ్గురును సామాన్య విద్యమాత్రమే యభ్యసించి, బ్రహ్మకుల సంజాతులే యయినను, గొన్నితరములనుండి యూరు పూర్వికముగఁ దమకుటుంబము సలాభదాయకముగ నుంట, వ్యవసాయవృత్తినవలంబించి కాలక్షేపమొనర్చుచుండిరి. కమలయు సోదరులయొద్దనే బాగుగఁ జదువను వ్రాయను నేర్చికొనెను. ఆమెకుఁ బదిరెండువత్సరములవయసు వచ్చువఱకు బాల్యవినోదములతో, దిన మొక క్షణముగఁ గాలము గడచిపోయెను. జ్యేష్ఠ పుత్రికలకిదివఱకుఁ దండ్రి తనగౌరవమునకుఁ దగినట్లు

లక్షణలక్షితులగు వరులనన్వేషించి, యధికమగు వరశుల్క మొసఁగి, వివాహము గావించెను. అందువలన గొంత భూవసతిఁ గోల్పోయెను కూడ.

ఇఁకఁ బన్నెండవవత్సరము రాఁగానే కమల వివాహవిషయమున రామనాథునికి మిగుల నాందోళనకలిగెను. మునుపటివలె విశేషధనము వెచ్చించుటతో జీవితాధారమై మిగిలిన భూవసతికిఁగూడ భంగము రాఁగలదు. వివాహ మతిసాధారణముగ జరుపుచోఁ దనకు సంఘమునఁ దలవంపుగలుగును. ఏమైనఁ బూర్వమువలె నిఁక వరశుల్కము విశేష మొసఁగు సంకల్పము రామనాథుఁడు వదలుకొనెను.

౨

వీరన్న సోమయాజులు నిష్ఠాపరుఁడు. వైదికప్రపంచమున నాయనకు మంచి పలుకుబడి గలదు. ఆయన యజ్ఞముఁ జేయలేదు. కాని ఆయన పితామహుని నామమగుటఁ, బైవిధముగ నాయనకు నామకరణము గావింపఁబడెను. సమస్తశుభాశుభకర్మలుఁ జేయించుటలో నాయన కందినచేయి లేదని ఘంటాపథముగఁ జెప్పవచ్చును. ఆయనకు భూవసతి బహుస్వల్పము. కాని ఏసామాన్యభూస్వాములకురాని యాదాయము, వైదికవృత్తివలన నాయనకు లభించుచుండును. ఆయన జ్యేష్ఠకుమారుఁడు రామస్వామి తండ్రియొద్దనే కుల విద్య లభ్యసించుచుండెను. ఆతనికిఁ బదునాల్గేండ్ల వయసు. కుమారునికిఁ గొంచెము పెద్దపిల్లఁజూచి వివాహమొనర్చుచోఁ దనకుఁ జేదోడుగనుండునని, లక్ష్మి సోమిదమ్మ యభిప్రాయము. ఆమె యడుగులకు మడుగులొత్తుచు నాజ్ఞాపించినట్లు చేయుటయే సోమయాజులు గారి ముఖ్యాదర్శము.

ఈసమయమున రామనాథుఁడు విశేష ధన మొసఁగి యింతకంటె నెక్కువ వరునిఁ దేలేమనియు, మర్యాదగలకుటుంబమునఁ బుట్టినవాఁడనియుఁ, దండ్రివలె సంఘమున నంతటిగౌరవమునకుఁ బాత్రుఁడు గాఁగలుగుననియు, నెంచి, "రామస్వామికిఁ దన కుమార్తెనిచ్చెదను. ఇందుల కంగీకరించి వివాహము జేసికొనవలయు"నని, సోమయాజులు గారికిఁ బెద్ద మనుష్యులచే వర్తమానముఁ బంపెను. తామనుకొన్నట్లుగఁ బెద్దపిల్లయే యగుట, సోమయాజులుగారు మాఱుమాటాడక, వివాహమున కంగీకరించెను. అనంతరము శుభముహూర్తమునఁ దనశక్తి ననుసరించి, సలక్షణముగ బంధుమిత్రుల సమక్షమున రామనాథుఁడు కమలకుఁ గల్యాణమొనరించెను.

3

కొంతకాలమునకుఁ గమల యుక్తవయస్కురాలై, యత్తవారింటికేగెను. నాఁటినుండియే ఆమె జీవితశకటము వివిధవ్యథా గహనమార్గమున నడువవలసి వచ్చెను. భర్తృసాహచర్యముచేఁ బూర్వముకంటె నధికమైన యానందముతోఁ గాలము గడుపవచ్చునను నామెకలఁపునకు వైపరీత్యము సంభవించెను. ఏది యమృతపాత్రయని తాఁదలఁచుచుండెనో, యది విషపాత్రయై పరిణమించెను. కమల చిన్నదనమునఁ బని పాటల నభ్యాసముగలది కాకపోయినను, అత్తమామలను మెప్పించుటకుఁ దనశక్తికొలఁది, పాటుపడుచుండెను. భక్తిశ్రద్ధలతోఁ బతిసేవజేయుచు, నాతని నిర్మలప్రేమ సంపాదింపవలయునని, యనేకవిధములఁ బ్రయత్నించుచుండెను.

రామనాథుఁడు తన పెద్దయల్లుండ్ర కిర్వురకు వరకట్నముగ విశేషధన మొసఁగెననియు, తన కంతగ నీయలేదనియుఁ, గాన నంతధనము తనకుఁగూడ నొసఁగువఱకుఁ గమలఁ గౌరవముగఁ జూడవలదనియుఁ దలిదండ్రులు రామస్వామికి హితోపదేశముఁ జేసిరి. యుక్తమునయుక్తముఁ దెలియనేరని యమాయకుఁడగు నాతఁడు శ్రీరామచంద్రుఁడువోలెఁ, బితాజ్ఞాపరిపాలనయందప్రమత్తుఁడై, మెలఁగుచుండెను. ఏదో యొక వంకఁబెట్టుకొని, నిష్కారణముగ నామె నవ

దవుడు గొట్టుటకుఁగూడ రామస్వామి వెనుఁ దీయకుండెను. భర్త తనవిషయమై యేవిధముగ బ్రవర్తించిన, నాతని సంతమాత్ర మెదురొక్కనక, శాంతచిత్తముతో దనభర్తయు, అత్తమామలును, సదయహృదయమునఁ దన్నుఁ జూచునట్లు చేయుమని సర్వేశ్వరునిహృదయమునందు, బ్రార్థించుచుండెను. చిన్న పిల్ల యగు నామెను లాలించుటకుబదులుగ, నత్తమామలును 'పని పాటలు చేఁత గావనియుఁ, జేఁతనైనంతనఱకుఁ గూర బుద్ధిఁ జేయుటలేదనియు, మాతండ్రియొసఁగిన మడిమాన్యములకీ గౌరవము చాలును లే;' యనియు నామె నెత్తిపొడుపుమాట లాడుచుండిరి. నిజమునకుఁ బదునెన్మిదివత్సరముల యీడుగల యేబాలికయుఁ జేయఁజాలనిపనిఁ గమల ప్రతిదినము, మిక్కిలి యోపికతోఁ జేయుచునుండెను. మనసునందు దురభిప్రాయము వహించియుంట, నత్తమామలయెడ నామె సుగుణములెల్ల వృథాయయ్యెను.

తుదకొకనాఁడు తనభర్తతో, నేకాంతమునఁ దన్నట్లు బాధించుట పాడిగాదనియు, న్యాయమాలోచింప వలయుననియు, ననేకవిధముల నాతని మనసు కరగునట్లుగఁ గమల సాహసించి చెప్పుకొనెను. అతఁడును కమలవిషయమై తలిదండ్రులుఁ దాను ననుసరించుమార్గ మక్రమమని, గ్రహించెను. కాని తనకెదురాడినచోఁ దనచే సంపాదింపబడిన ద్రవ్యమేమియు, నీకు ముట్టఁజాలదనియు, నీ త్రోవ నీవు చూచికొనవలయుననియుఁ దండ్రి చెప్పియుండెను. తల్లిదండ్రులమాటఁ ద్రోసిపుచ్చి, భార్యవిషయమున న్యాయముగఁ బ్రవర్తించుట కాతని కేవిధముగను సాహసశక్తిలేదు. అదియుఁగాక తండ్రియాస్తిని, ఆతని యనంతర మాతని బహులాభకరమగు వృత్తి వారసత్వమును, జూచిచూచి వదలుకొనుటెట్లు? రామస్వామి కేమియుఁ దోచకుండెను. ఆస్తివదలుకొనినను దన ధర్మపతిత్వము సార్థక మొనరించుకొనవలయునని, యాతనిహృదయము ప్రతిధ్వనించుచుండెను. తండ్రితో విడివడిన, నొకపూటయైన గడచుమార్గము లేదు. చివరకాతఁడు పూర్వపు ధోరణినే యవలంబించెను.

౪

రామనాథుఁడు తన మూఁడవకుమారుని వివాహమున కాహ్వానించుటకై, సోమయాజులుగారి గృహమున కేగెను. ఆదటు బంధుమిత్ర పరివారసమేతముగ రావలయుననియుఁ, గమలఁ దనతోఁ బంపుడనియుఁ గోరెను. "పెత్తనమంతయు రామస్వామిదే; కనుక కమలఁ బంపువిషయమున నాతఁడంగీకరించుచోఁ, దమకు సమ్మతమే!" అని కమల యత్తమామలు జెప్పిరి. అచటనేయున్న రామస్వామి, తోడి యల్లుండ్రకుఁ గట్నముగ నొసఁగినంతధనము, వడ్డీతో ముదుపుగ ముందుచెల్లించినచోఁ, గమలఁదీసికొని, వివాహమునకు వచ్చెదననియు, నట్లుగానిచోఁ, మావిషయమై మీరు స్మరింపవలదనియు, మోమోటము లేకుండఁ జెప్పివైచెను. మీరు పెద్దలు. కుమారునితో జెప్పి వివాహమునకుఁ బంపవలెనని చెప్పబోగా, నాతనియభీష్టము విరుద్ధింపనిచో, లాభము లేదు; నామాట వినడని సోమయాజులుగారుఁ దెల్పినారు. చేయునది లేక విషణ్ణహృదయుఁడై రామనాథు డింటికిఁ బోయెను.

తలిదండ్రులకుఁ గనిష్ఠసంతానమునఁ బ్రీతి యెక్కువ. అట్టిగారాబుపట్టి కమలలేకుండ, వివాహము కావించుకొనుటకు రామనాథుని మనసెట్లొప్పును? ఒకవేళ నాతఁ డంగీకరించినను, నిర్మలప్రేమ స్వరూపమగు మాతృహృదయము ధరింపఁగలుగునా? మిక్కిలి శ్రమపడి యెట్టకేలకు రామస్వామి కోరిన దానిలో, సగము ధనమిచ్చి, తక్కుఁగలసొమ్ము వివాహమైన మఱల నింటికి వెడలునపుడిచ్చెదననియొప్పించి, రామనాథుఁడు కమలలేని లోటులేకుండఁ గల్యాణము జయప్రద మొనరించెను.

౫

రామస్వామికి మాటయిచ్చిన మిగిలిన సగము ద్రవ్యమునీయకయే, యనివార్యమగుట రామనాథుఁ డమరాలయమున కరిగెను. తనకు రామనాథుఁ డీయ వలసిన బాకీధనము సంవత్సరములోన నీయనిచోఁ గమలకు వివాహవిచ్ఛేదము ప్రాప్తించునని, బావమరదులకు రామస్వామి నిర్దాక్షిణ్యముగ లేఖ వ్రాసెను. వివాహమునకు వచ్చిననాఁటినుండియుఁ గమలను రామస్వామి తనగృహమునకుఁ దీసికొని వెళ్లలేదు. హిందూసంఘమున వివాహవిచ్ఛేదమున్నదా? భర్త సంసారమున కనర్హుఁడైనఁ గుమార్గగామియైన మఱెట్టి పరిస్థితులు సంభవించినను, భార్య యాతని పరిత్యజించుటకుఁగాని, మఱొకనిఁ జేపట్టుటకుఁగాని, బ్రహ్మచారిణిగ నుండుటకుగాని, హిందూసంఘ మెంతమాత్ర మంగీకరింపదు. పురుషుఁడే యామెను పరిత్యజించినను పైఁజెప్పిన ఏవిధమున నామె ప్రవర్తించిన నది సంఘద్రోహము, మతద్రోహము, మహాపాపము, ఘోరనరకప్రదము. పురుషుఁడకారణముగ, నెందఱవిడనాడి రెండవఱిఁ గైకొనిన, నది ధర్మవిరుద్ధముకాదు. దాని సంఘము సమ్మతించును. వివాహవిచ్ఛేద మొనరించుకొనుటకు హిందూసంఘమున స్త్రీలకు హక్కులేదు. పురుషులకుమాత్రము సంపూర్ణాధికారము కలదు. ఇట్టి ధర్మములు నశింపమి నెన్ని హృదయములు, మన పవిత్ర భారతభూమి నేడుకుమిలి కృశించుచున్నవో !!

దారిద్ర్యముచే రామనాథునిపుత్రులు రామస్వామికి ధనమీయలేకపోయిరి. రామస్వామి చెప్పినవిధము నసె, దూరగ్రామమందలి యొక బాలికమోసగించి, వివాహమాడెనను వార్త కమలకు, సోదరులకుఁ, దెలిసెను. విన్నవారు సోమయాజులుగారిఁ దీవాట్లు పెట్టుటకుమారుగ, నీయవలయు ద్రవ్యమిచ్చిన నింత పుట్టకుండుననియుఁ గమలయొద్ద మఱెట్టిదోషము లున్నవో యనియుఁ, బలువిధములఁ బలుకఁజొచ్చిరి. అప్రతిహతమైన పలుకుబడిగల పండితుఁడు, సోమయాజులుగారి నేమనుటకు సాహసింపఁగల సమర్థులెవ్వరు? కమల కిపుడు పాతికసంవత్సరముల నిండు జవ్వనము. పలుతెఱఁగులగు తలఁపులు విజృంభించు నడిమినయును. సకలమానవులు నభిలషించు ప్రకృతిసిద్ధములైన సౌఖ్యములన్నియు, నామెకుఁ గావలయును. కాని ఆమె ప్రవృద్ధములగుచున్న వాంఛాలతలు ద్రెంచివైచికొని, బలవంతముగ భౌతికసుఖముల సన్యసింపవలయుననియే, సంఘము కఠోరముగ శాసించును. అబలయగు కమల తీవ్రశాసనములగు సంఘశాసనముల నెట్లు ధిక్కరింపఁగలదు? సోదరులు నామెకీవిషయమున సుముఖులుగాలేరు. భర్తృపరిత్యక్తయగు సుదతి యందఱికిఁ బరిభవపాత్రమేకదా. మహర్షులకుఁగూడ నగమ్యమగు సమస్తవిషయ వైరాగ్యపుఁ బొలిమేర నామె యడుగిడలేదు. ఉన్నవిధమున నె యందఱిచేఁ బరిభవింపఁబడుచు, క్రూరాతిక్రూరవృత్తియం దామెకు మనసెక్కదు. సమగ్రధైర్యమున సంఘము నెదుర్కొని, సులక్షణలక్షితు నొకనిఁ జేపట్టి, లోకాదర్శప్రాయ యగుట కామెకు సాహసము చాలదు. తనహృదయమందుఁ బరిభ్రమించుభావములు తెలియఁజెప్పిన, వెంటనే గృహమునుండి యామె కుద్వాసనము చెప్పఁబడును. ఈదుర్భరపరిస్థితులనుండి బయటపడుమార్గము లేక, ఆత్మహత్య చేసికొనవలెనని, ఎన్నియో పర్యాయము లామె ప్రయత్నించెను. కాని యాత్మహత్య మహాపాతకమని, హృదంతరాళము నుండి యెవ్వరో బోధించుచున్నట్లు తోఁచుటచే, నప్పటికి మానుచువచ్చెను. ప్రతిదినమామెజీవితము సంశయాస్పదముగఁ దోఁచుచున్నది.

# సంఘబహిష్కరణ

సౌభాగ్యవతి సత్యవతికి,

నెచ్చెలీ! నీవు మాయూరిలోని ముచ్చటలు వ్రాయవలసినదని కోరియుంటివి. అవి ఒకవైపు నిష్ఠాపరుల అవివేకమునకు చింతయు, ఒకవైపు నవ్వును కలిగించుచున్నవి. అయినను వాటిని నీ సంతోషమునకై స్త్రీలపాలిటి కల్పవృక్షమును స్త్రీల పురోభివృద్ధికి పట్టుకొమ్మయు నగు గృహలక్ష్మియందు వెల్లడించుచుంటిని.

సోదరీ! మాయూరిలో సీమధ్య ప్రతివారి నోటినుండియు వెలి యను పదము వెలువడుచున్నది. రజస్వలానంతర వివాహము చేసినవారికి వెలి. హరిజనోద్ధరణకై పాటుపడువారికి వెలి. బ్రహ్మసమాజమునందున్నవారికి వెలి. వితంతు కేశఖండనము చేయక యుంచినవారికి వెలి. పై జెప్పబడినవారి బంధువులకు వారి ఇండ్లలో భోజనము చేసినవారికి దాహము పుచ్చుకొన్నవారికి వెలి. ఈవిధముగ బహిష్కరింపబడినవారలే మాయూరియందు ఎక్కువ సంఖ్య అయియుండిరి. దానినిబట్టి చూడ వెలి వేసినవారికే వెలి యయియున్నది. పోనీ, వెలి వేసినవారు తమరు రజస్వలానంతర వివాహములుచేయక వితంతు కేశఖండనము చేసియుండిరాయనిన అదియు లేదు.

సత్యమూ! మాయూరిలో నొక గొప్ప ఆయన గలడు. పై జెప్పినవారందరకు వెలి వేయు ముఖ్యుడు. కాని ఆయన నిష్ఠాపరుడనబడుటయేగాని, మాయూరిలో జరుగు ప్రతి హరిజనసభకు అధ్యక్షుడు. గొప్ప హరిజనసంస్థకు సెక్రటరీగానుండెను. ఇంగ్లాండుకు వెళ్లివచ్చినవారగు రాధాక్రిష్ణన్, సి. వి. రామన్ మొదలగువారందరు మాయూరు వచ్చినప్పుడు ఆయనయే వారి నెదుర్కొని ఆహ్వానించి వారి పంక్తికి టీపార్టీలకు వచ్చియుండెను. తన కుమారునికి రజస్వలానంతర వివాహముచేసి చేయులేదని బొంకిన మానవుడు.

నెచ్చెలీ! మరియొక్క సంగతి మా బంధువులలో నింకొక నిష్ఠాపరుడు గలడు. ఆయన తన జీవితకాలమున నెవరిచేతను వంట వండించుకొననని భీష్మించుకొని కూర్చొనిన మహనీయుడు. ఆవిధముగనే చచ్చునిమిషమువరకు వండుకొనియే తినెను. ఆయనకు ఇరువురు కుమారులు కలరు. వారు నవీనయువకులు కాని అందు ప్రథమునకు తండ్రి బలవంతమున బాల్యవివాహము చేసెను. కాని ఆయన ద్వితీయ పుత్రుడు బాల్యవివాహమునకు ఒప్పుకొనక బ్రహ్మసమాజమునందునుగల సంఘసంస్కర్తలయొక్క కుమార్తెను వివాహమాడ నిశ్చయించుకొనెను. దానికి తండ్రి మొదట ఒప్పుకొనలేదు. అతను పట్టినపట్టు వదలనందున తండ్రి అంగీకరించెను. కాని ఆ వివాహమైన మూడునెలలలోపలనే ఆ నిష్ఠాపరుడు అనాయసముగ దివము నలంకరిం

చేను. కాని వారు బ్రహ్మసమాజపువారి పిల్లను వివాహమాడినందుకు వారి కిదివరకే వెలి వేసియుండిరి. అందువలన వారింటికి యెవరును రారైరి. కాని మాయూరిలో సంఘసంస్కర్త లనబడువారు వెలివేయ బడినవా రనబడువారు వారికి సహాయభూతులై ఖర్మకాండనంతయు జయప్రదముగ జరిపిరి. వారి యింటిలో ఖర్మ జరిగినన్ని రోజులును భోజనముచేసిన ఆమెను నిష్ఠా పరుడని మొదట చెప్పబడిన ఆయన తన యింటిలో వంటయు వడ్డనయుచేయుట కేమియు నభ్యంతరపరుప లేదట. కారణము తెలియదు.

చెలీ! పాపము ఇంకొకాయన యింటిలో పితృదినము వచ్చెను. ఆయన బ్రహ్మసమాజపుపిల్లను వివాహమాడినవారికి ముఖ్య బంధువు. అందువలన నాయనకు కూడ మన నిష్ఠాపరులు వెలివేసిరి. పాపమా బ్రాహ్మణుడు పంచకవ్యము పుచ్చుకొంటిననియు శుద్ధుడనై తిననియు లబలబలాడెను. కాని ఆయన పుచ్చుకొన్నది పంచామృతము. పంచామృతమునకు పంచకవ్యమునకు భేదము తెలియని అమాయికమానవుడు. దానికి యెవ్వరు పంచకవ్యము చేసియిచ్చి రని అడిగిరి. దానికా బ్రాహ్మణు డెవరో ఆచార్యులుగారు చేసియిచ్చిరని చెప్పెను. దానికా నిష్ఠాపరులు ఆఆచార్యులుగారు సంఘసంస్కర్తలయిండ్లకు వెళ్లినందుల కిదివరకే వెలిబడియుండెనని జవాబునిచ్చిరి.

సత్యవతీ! ఇది యెక్కడి అన్యాయమో గాని తమ యిష్టమువచ్చినవారికి వెలిలేదట వారెట్టి పనులుచేసినను అభ్యంతరము లేదట. వారి కయిష్టులైన వారందరకు వెలి. తమ పిల్లలు రజస్వలలైనను దాచుకొందురు. పరులపిల్లలు కానిదే వారు రజస్వలలైరని వెలి వేయుదురు. ఎవరో ఒకామె అన్నదటలే, పెండ్లిఅగువరకు మన నిష్ఠా పరులపిల్లలు రజస్వలలుకారు తరువాత నగుదురని.

సహోదరీ! మాబంధువులలో నింకొకాయన గలడు. ఆయన నేను చాల నిష్ఠా పరుడనని విఱ్ఱవీగుచుండెడివాడు. ఆయన కిరువురు కుమార్తెలు కలరు. పాప మాతడు అనేక కష్టములను కుమార్తె వివాహమునకై పడెను. ఏమైననేమి ఆమె వివాహమునకుముందే పుష్పవతి అయ్యెను. దానికా కుటుంబమువారు భయపడి నానాకష్టములనుచెంది ఇంట కలువు కొని అదరాబాదరాగా వివాహముచేసిరి. కాని ఇప్పుడు రెండవకుమార్తె పుష్పవతియై సంవత్సరమైనది. చేతిలో డబ్బులేదు. ఇది వరకే అప్పులలోనుండిరి. ఇక వీలులేక మాట్లాడక ఊరకొనిరి. ఇప్పుడు నిష్ఠా పరుడనను గర్వము పూర్తిగ సణగినది. ఆయనకుకూడ వెలివేసియుండిరి. నిష్ఠా పరులమనుకొను ప్రతివారును ఈవిధముగ గర్వభంగములను పొందుచున్నారు. చూడగ ఇంకను కొద్దిరోజులలో నిష్ఠాపరుల మనుకొను ప్రతివారికి ఈవిధముగ గర్వ భంగమగునటుల నున్నది.

శ్రీప్రియసోదరి,

వేణువినోదిని.

# న్యాయానికి కాలంగాదు

శ్రీమతి వెలిదండ చూడికుడుతమ్మగారు

రామచంద్రుడు యిరవైరెండేండ్ల యువకుడు. బ్రాహ్మణకుటుంబమునకు చెందినవాడు. సద్వంశీయుడు. ఒకరోజు సాయంకాలము వీధిఅరుగుమీద ఏదో ఆలోచిస్తూ కూరుచున్నాడు. అతడి మొగంలో నిరాశ, అసంతృప్తి పూర్తిగా ప్రతిఫలిస్తున్నాయి. ఆదారినిపోతూ పోతూ, అతనిస్నేహితుడు కోదండరావు గుమ్మంఎక్కి "ఏమిరా, అలాగున్నావు. ఈ రోజు వింతలుఏమైనా ఆఫీసులోజరిగాయా ఏమిటి?" అని ప్రశ్నించాడు. "నిత్యం చచ్చేవాడికి ఏడ్చేవాడెవడన్నట్టుగాఉంది నానౌకరీ నావేషం. ఒల్లనిమగడు ఎల్లప్పుడూ ఏదో తప్పువెతుకుతూ దినమస్తమానమూ కాల్చుకుతింటూఉంటె ఆ భార్యఎంత అవస్థపడుతూ ఉంటుందో అది ఇప్పుడునాకు స్వానుభవమైంది నా అధికారిధర్మాని. అతడు వచ్చేటప్పటికి ముందుగా అన్నీ సిద్ధముచేసిఉంచుతే 'ఏమిటో పెద్దరికం, కళ్లు నెత్తిమీదకెక్కినట్టున్నాయి' అని గ్రుడ్లుఉరుముతూ నోటికిరాని దుర్భాషలాడుతాడు. పోనీ వచ్చినతరవాతనే చేయవచ్చునని ఊరుకుంటే 'గవర్నమెంటు సొమ్ము మీకు తేరగా మేపటానికైనట్టుందని అంటూ తాపులుతరవాయిగా మెడగెంట్లతో సరిపుస్తున్నాడు. నాఅవస్థచెప్పుకోటానికి వీల్లేకుండాఉంది. ఈవెధవ ఇరవైరూపాయలకోసం బంట్రోతుపనికన్నా కనికష్టమైనపని చేయడమేకాకుండా ఈమాటలుపడటం మరీ అసహ్యంగాఉంది. ఈరోజుమధ్యాహ్నం మా అధికారితో మాటాడటానికని ఇంకోకఅధికారివచ్చాడు. అతడు చూస్తూఉండగానే ఏదో నెపంబెట్టి రెండు తోపులు మెడమీదచెయ్యివేసి నన్ను అవతలకిత్రోసి అడ్డమైనతిట్లూతిట్టాడు. నాఅవస్థ కళ్లారచూచి చెవులారవిన్న ఆ అధికారి ముక్కుమీద చేయివేసుకొని నిర్ఘాంతపడిచూస్తూ కుర్చీమీద అలాగేకూచున్నాడు. బహుశా అతను మా పెత్తండ్రిభార్యకు దగ్గరచుట్టములాగ నాకు జ్ఞాపకము. ఆసమయంలో నాకు కలిగిన సిగ్గు అవమానము నన్ను కాల్చివేస్తున్నాయి. నన్ను గురించి ఎవరిచేతనైనా కొంచం చెప్పిద్దామనుకున్నా వారంతటవారు చెప్తుదామనుకున్నా ఏమాత్రం వినిపించుకోడు. మీదుమిక్కిలి ఆచెప్పేవారికి ఏమి అవమానము అతనివల్లకలుగునో అని భయంకొంత. ఇదంతా నాఖర్మము. స్కూలుఫైనలుప్యాసైన వాళ్లందరూ నాలాగే యమయాతన అనుభవిస్తున్నారా ఏమిటి? నావంటినిర్భాగ్యుడు, దురదృష్టవంతుడు ఇంకోకడుండబోడు." అని తనబాధలను స్నేహితునికో చెప్పుకున్నాడు. స్నేహితులతో కష్టసుఖం చెప్పుకుంటే వీళ్లలోఉండే కొంతబాధ తగ్గుతుందనికదా వాడుక. కోదండరావుని కిదంతా వినేటప్పటికి గుండె చెరువైపోయింది. కాని ఎవరేమిచేయగలరు? ఒక్కనిట్టూర్పుమాటతప్ప.

రామచంద్రుడి అధికారి స్వభావంగా బ్రాహ్మణద్వేషి. పనియొక్కలోటుపాట్లు, మంచిచెడ్డలు అతనికవసరంలేదు. బ్రాహ్మణునిఇంట్లోఉన్న పురుగుకూడా అతనికి బ్రాహ్మణకంపే. అతనిలో ఈర్ష్యాగుణం ఎంతవరకు ఎక్కువలెనో అంతవరకుఎక్కి అతనిని వశపరచుకున్నాది. అతడిప్పుడు పూర్తిగా అసనోయుడనియే మనము ఒప్పుకోవాలి. ఎందుకంటే తన్ను తాను తెలుసుకునే స్థితిలోలేడు. కండ్లుకలవానికంటికి పెద్దదీపంలాగ మన రామచంద్రుడు అతని కంటికి కనబడుచున్నాడు. తన్ననుసరించి తిరుగుతూ తన ఇంట్లో చాకిరీచేస్తూఉన్న ఇంకోకనాయుడికి ఆ కాస్త పనీఇచ్చి ఇంట్లోచాకిరీ ఆఫీసుచాకిరీ పరిపుచ్చుకుంటా

# న్యాయానికి కాలంగాదు

శ్రీమతి వెలిచండ చూడికుదుతమ్మగారు

రామచంద్రుడు యిరవైరెండేండ్ల యువకుడు. బ్రాహ్మణకుటుంబమునకు చెందినవాడు. సద్వంశీయుడు. ఒకరోజు సాయంకాలము వీధిఅరుగుమీద ఏదో ఆలోచిస్తూ కూరుచున్నాడు. అతడి మొగంలో నిరాశ, అసంతృప్తి పూర్తిగా ప్రతిఫలిస్తున్నాయి. ఆదారినిపోతూ పోతూ, అతని స్నేహితుడు కోదండరావు గుమ్మంఎక్కి "ఏమిరా, అలాగున్నావు. ఈరోజు వింతలుఏమైనా ఆఫీసులోజరిగాయా ఏమిటి?" అని ప్రశ్నించాడు. "నిత్యం చచ్చేవాడికి ఏడ్చేవాడెవడన్నట్టుగాఉంది నానౌకరీ నావేషం. ఒళ్లునిమగడు ఎల్లప్పుడూ ఏదో తప్పువెతకుతూ దినమస్తమానమూ కాల్చుకుతింటూఉంటె ఆ భార్యఎంత అవస్థపడుతూ ఉంటుందో అది ఇప్పుడునాకు స్వానుభవమైంది నా అధికారిధర్మాన. అతడు వచ్చేటప్పటికి ముందుగా అన్నీ సిద్ధముచేసిఉంచుతే 'ఏమిటా పెద్దరికం, కళ్లు నెత్తిమీదకెక్కినట్టున్నాయి' అని గ్రుడ్లుఉరుముతూ నోటికిరాని దుర్భాషలాడుతాడు. పోనీ వచ్చినతరవాతనే చేయవచ్చునని ఊరుకుంటే 'గవర్నమెంటు సొమ్ము మీకు తేరగా మేపటానికైనట్టుందని అంటూ తాపులంతరవాయిగా మెడగెంట్లతో సరిపుస్తున్నాడు. నాఅవస్థచెప్పకోటానికి వీల్లేకుండాఉంది. ఈవెధవ ఇరవైరూపాయలకోసం బంట్రోతుపనికన్నా కనికష్టమైనపని చేయడమేకాకుండా ఈమాటలుపడటం మరీ అసహ్యంగాఉంది. ఈరోజుమధ్యాహ్నం మా అధికారితో మాటాడటానికని ఇంకొకఅధికారివచ్చాడు. అతడు చూస్తూఉండగానే ఏదో నెపంబెట్టి రెండు తోపులు మెడమీదచెయ్యివేసి నన్ను అవతలకిత్రోసి అడ్డమైనతిట్లూతిట్టాడు. నాఅవస్థ కళ్లారచూచి చెవులారవిన్న ఆ అధికారి ముక్కుమీద చేయివేసుకొని దిగ్భ్రాంతపడిచూస్తూ కుర్చీమీద అలాగేకూచున్నాడు. బహుశా అతను మాపెత్తండ్రిభార్యకు దగ్గిరచుట్టము లాగ నాకు జ్ఞాపకము. ఆసమయంలో నాకు కలిగిన సిగ్గు అవమానము నన్ను కాల్చివేస్తున్నాయి. నన్ను గురించి ఎవరిచేతనైనా కొంచం చెప్పిద్దామనుకున్నా వారంతటవారు చెపుదామనుకున్నా ఏమాత్రం వినిపించుకోడు. మీదుమిక్కిలి ఆచెప్పేవారికి ఏమి అవమానము అతనివల్లకలుగునో అని భయంకొంత. ఇదంతా నాఖర్మము. స్కూలుఫైనలుప్యాసైన వాళ్లందరూ నాలాగే యమయాతన అనుభవిస్తున్నారా ఏమిటి? నావంటినిర్భాగ్యుడు, దురదృష్టవంతుడు ఇంకొకడుండబోడు." అని తనబాధలను స్నేహితునితో చెప్పుకున్నాడు. స్నేహితులతో కష్టసుఖం చెప్పుకుంటే వీళ్లలోఉండే కొంతబాధ తగ్గుతుందనికదా వాడుక. కోదండరావునకిదంతావినేటప్పటికి గుండె చెరువైపోయింది. కాని ఎవరేమిచేయగలరు? ఒక్క నిట్టూర్పుమాటతప్ప.

రామచంద్రుడి అధికారి స్వభావంగా బ్రాహ్మణద్వేషి. పనియొక్క లోటుపాట్లు, మంచిచెడ్డలు అతనికవసరంలేదు. బ్రాహ్మణునిఇంట్లోఉన్న పురుగుకూడా అతనికి బ్రాహ్మణకంపే. అతనిలో ఈర్ష్యాగుణం ఎంతవరకు ఎక్కువలెనో అంతవరకుఎక్కువ అతనిని వశపరచుకున్నాది. అతడిప్పుడు పూర్తిగా అసహాయుడనియే మనము ఒప్పుకోవాలి. ఎందుకంటే తన్ను తాను తెలుసుకునే స్థితిలోలేడు. కండ్లుకలవానికంటికి పెద్దదీపంలాగ మన రామచంద్రుడు అతని కంటికి కనబడుచున్నాడు. తన్ననుసరించి తిరుగుతూ తన ఇంట్లో చాకిరీచేస్తూఉన్న ఇంకొకనాయుడికి ఆ కాస్త పనిఇచ్చి ఇంట్లోచాకిరీ ఆఫీసుచాకిరీ సరిపుచ్చుకుండా

మనసే దురుద్దేశంతో ఏలాగైనా రామచంద్రుణ్ని తీసి వేయ్యాలని ఇన్ని ఎత్తులు ఎత్తుకున్నాడు.

౨

మర్నాడు మామూలుగా రామచంద్రుడు గుండెలు గడగడకొట్టుకొంటూఉంటే ఏడుగంటలకల్లా అధికారి గారి వీధివాకిట్లో నిలబడ్డాడు. ఈమెా స్తైరనవేళ నిర్ణయం అనగా ఉదయం 7 మొదలు సాయంకాలం 7 గంటలవరకు ఆఅధికారి ఏర్పాటుచేసింది. సర్కారుచట్టము అందరికీపెట్టినవేళే ఇతనికీపెట్టింది. మధ్యాహ్నభోజనం అక్కడికితెచ్చుకొని ఏమూలో ఒకమూల తినవలసిందే. ఎప్పుడైనాఒకప్పుడు ఏపాటి ఆలస్యంఅయినా సర్కారుసొమ్ము తేరగా తినేస్తున్నారని వినరాని తిట్లుతిట్టడానికి మొదలు. తాను వందలువందలు, వేలకువేలు జీతంతీసుకుంటూ ఏ రెండు మూడుగంటలో ఆఫీసులోఉంటాడు. ఆ కాస్సేపైనా పనియందుచూపించే శ్రద్ధకన్న తాబేదార్లను తిట్టటమందే ఎక్కువశ్రద్ధ చూపించుతాడు. 'తా'మ్మని 12 గంటలు వినబడతాయా ఎప్పుడు వెళ్దామాయని చూస్తూఉంటాడు కాబోలు 12 కొట్టే సరికల్లా కారెక్కి బుఱ్ఱుమని ఇంటికిపోతాడు. ఇదంతా సర్కారు కూడిక పేకాబోలు అతనిఉద్దేశ్యం.

పొద్దున్నే 7 గంటలుకొట్టేసరికి వచ్చిన రామచంద్రుడు తొమ్మిదికొట్టేవరకూ ఆలాగే గేటుదగ్గిర నిలువుకాళ్లమీద నిల్చున్నాడు. అంతవరకూ ఎవ్వరూ అతీలేదు గతీలేదు. తొమ్మిదికొట్టినతరువాత మన ఆఫీసరుగారు ఇతనివైపైనా చూడకుండా, చూస్తే బ్రాహ్మణకంపుఏమైనా తనకుతగిలి తాను మైల పడపోతానని కాబోలు ఇతన్ని తప్పించుకొని, ఎఱ్ఱగా చింతనిప్పులాగ మెఱుస్తూఉన్నకళ్లతో ఊర్ధ్వంవైపు చూసుకుంటూ నోట్లో సిగరెట్టొకటి తగిలించుకొని కారెక్కి వెళ్లిపోయాడు.

రామచంద్రునగుండెలు దడదడ లాడిపోయాయి. ఏంపుట్టుమునుగుబోతుందో ఈశ్వరా అని అనుకుంటూ తానుకూడా ఇక చేయునదిలేక ఆఫీసు మొగం పట్టాడు.

ఈ అధికారికింత బ్రాహ్మణద్వేషం ఎందుకో. ఇంతచదువూ చదువుకొని చదువుకున్నవాళ్లకు ఉండవలసినజ్ఞానం తాను ఉంచుకోకపోవటం, చూసిన కళ్లకి చాలా ఆశ్చర్యం, విషాదం కలిగించకమానదు. ధర్మశాస్త్రాల్లో బ్రాహ్మణులు స్వార్థంకోసరం ఉద్దేశపూర్వకంగా అబ్రాహ్మణులకు పూర్తిగా అన్యాయంచేశారని అబ్రాహ్మణులందరూ కేవలము ద్వేషమూ, అక్కసమును మనస్సులలోపెట్టుకొని దేశద్రోహము, సంఘద్రోహము చేస్తూఉన్నారు. కాని వారే మరికొంచం దూరదృష్టితో ఆధర్మశాస్త్రాన్నే చూడవలసింది. అదేమీ ఇతడు యోచించలేదు. దేశసంరక్షణ వాళ్లచేతుల్లో, వర్తకవ్యాపారాలు వాళ్లచేతుల్లో, అందరికీ జీవనోపాధికల్పించే వ్యవసాయం వాళ్లచేతుల్లోనే ఉండవలసినదిగా ఆధర్మశాస్త్రాల్లోనే విధించారు.

బ్రాహ్మణుడైనవాడు భవతీ భిక్షాందేహిమీద జీవిస్తూ ప్రతిఫలరాహిత్యంగా విద్యాదానం (అప్పటి కాలంలో వాడుకలోవున్న) చేస్తూ ఇంద్రియవాంఛా సంతృప్తికి ప్రయత్నించకుండా ఇంద్రియదమనానికే ఎక్కువ కష్టపడుతూ, వ్రతోపాసనలను చేస్తూ ప్రపంచంలో కాలం గడపవలసిందిగా విధింపబడింది. కాలక్రమేణా అన్నిధర్మములూ అందరియందూ నశించినట్టుగానే బ్రాహ్మణులయందు నశించటం ప్రకృతిసిద్ధమైంది. అందుకని ప్రస్తుతమున్న లోపాలను దిద్దుబాటు చేసుకొనటానికిబదులూ, బ్రాహ్మణులను తిట్టడమే, బాధించడమే పరమావధిగా పెట్టుకోవటం "అమ్మను తిట్టకురా లంజకొడుకా" అన్నట్టుంది.

రామచంద్రుడు ఆఫీసులో అడుగుపెట్టాడు. ఆసమయంలో అతనిలోఉన్న స్వయం వ్యక్తిత్వం

అంతా నశించిపోయింది. ఆస్థానే భయమధిష్ఠించి అతని నోటివెంట ఒక్కపలుకైనా రానివ్వటంలేదు. ఆఫీసరుగారు మామూలుగా తక్కిన తాబేదార్లందరి మీద కసరటం, ఎగరటం చేస్తున్నాడు. ఇతనిని ఆతిట్లు తినటానికైనా పిలవలేదు. పాపం రామచంద్రుడు ఏమీ తోచకుండా చేతులు పిసుక్కుంటూ నిల్చున్నాడు ఇంకా పిలుస్తాడేమో, ఇంకా పిలుస్తాడేమో అని. 12 గంటలు కొట్టాయి. ఆఫీసరుగారు ఇంటికి వెళ్లిపోయినారు. అంతవరకు ఇతను నిలబడే ఉన్నాడు నిలువుగాళ్లపడి.

సమానబాధితులు ఎక్కువ స్నేహితులగుట సృష్టి స్వభావము. అత్తగారిచేత కోదంత్రికంపడుతూ ఉన్నంతకాలం తోడికోడళ్లు ఎంతో సఖ్యంగా ఉంటారు. వారు తమవ్యక్తిత్వానికి స్థానం కలగగానే, 'ఎవరికివారే, యమునాతీరే' అని అన్నట్టుగా ఉండవలసిందే. అది తప్పనిదుస్తే ఆఇంట్లో ఉన్న కలతలు, అసంతృప్తులు చెప్పలేము.

రామచంద్రుడికిగూడా ఒక స్నేహితుడు తనలాంటివాడే ఒకడు దొరికాడు. ఈతనిఅవస్థంతా తానూ అనుభవిస్తూ ఉండటంచేత అతనిమనస్సు మరీ మెత్తబడింది ఇతని అవస్థచూచి. ఆఆఫీసరు ఇంటికివెళ్లంగానే, దగ్గరకుపిలచి "ఎందుకిలా దుశవజాగరంచేస్తూ ఇక్కడ శ్రమపడుతున్నావు అనవసరంగా. నిన్న పనిలోంచి తీసేసినట్టుగా నిన్నసాయంత్రమే కాగితం వ్రాసి ఉంచాడు. ఈరోజుకూడా నీవు అవస్థపడుతూ ఉంటే ఎలాగుంటుందో చూడాలని సరదా వేసిందికాబోలు ఇప్పుడు ఆఆర్డరును నీకిమ్మన్నాడు. ఇంతకూ దేవుడులేడా ఏమిటి. ఎప్పటికైనా అమాయికులను అనవసరంగా బాధించినబాధింపు, వారుపడిన మనఃఖేదము అతడికి కనబడకపోదు. ఇదిగో ఆకాగితం. అనవసరంగా కుళ్లపోకు. బ్రాహ్మణుడవు ఇంతో అంతో మంచిఉద్యోగానికి తగినచదువు చదువుకొన్నవాడవు. ఇంతనీచపుపనిలోకి నీవంటివాడు వచ్చాడు కదా అని ఈషణ్మాత్రమైనా మనస్సు కరుగవలసింది. అదికాకుండా కత్తికట్టి సాధించాడు. పేరుపొంద తగ్గవాడే వెళ్లు వెళ్లు" అని చెప్పాడు.

ఇంత అన్యాయం తనకు అకస్మాత్తుగా జరుగుతుందని ఎరుగడు మన అమాయకుడు. గవర్నమెంటు చట్టములప్రకారం ఎంతకష్టపడినా తన ఖాయపుపనికి సాధారణంగా నష్టంకలగదనే విశ్వాసంతో ఉన్నవాడు. ఒక్కవార్నింగైనా లేకుండా అన్యాయంగా పిడుగు మొత్తినట్టుగా ఒకేసారి ఈకబురు వినేటప్పటికి నిలువునా కూలబడ్డాడు. వెయ్యిరూపాయల ఉద్యోగం పోయినట్టుగా. అవునుమరి. అతనికి ఆ ఇరవైరూపాయలే 20 వేలులాగు కనిపించుతవి. అది అతనిస్థితి.

3

మధ్యాహ్నం ఒంటిగంటకు మెల్లగా కాళ్లీడ్చుకుంటూ రామచంద్రుడు ఇంటికివచ్చి వీధివాకిలితలుపు తట్టాడు. అతనితండ్రి 60 ఏండ్ల ముసలాయన కొడుకోసరం అన్నం మూటకట్టుకొని అప్పుడే తలుపు తీయబోతున్నాడు. తలుపు తీసేటప్పటికల్లా ఎదురుగాఉన్న కొడుకునుచూచి ఏమిరా రాముడూ! నీవే వచ్చావు. ఇవాళ వంట కొంచం ఆలస్యంఅయింది. అమ్మ అనుకొంటూనేఉంది. అని ఏమేమో మాటలాడాడు.

రామచంద్రుడు దేనికీ బదులుపలకలేదు. అక్కడే ఉన్న ఒక నులకమంచంమీద కాళ్లయినాకడుక్కోకుండా బొక్కబోర్లా పడుకున్నాడు. అమాయికులైన తల్లిదండ్రులూ, ఇంకా ఉన్న అన్నతమ్ములు, అక్కచెల్లెళ్లు అందరూ ఏమీతోచక దగ్గరగావెళ్లి సంగతిసందర్భాలను అడుగుతూ భోజనానికి లెమ్మంటున్నారు. కొత్తగా కాపురానికివచ్చిన అతనిభార్య అందరితో చొరవగావచ్చి మాటాడటానికి బిడియపడుతూ ఆతురాగా లోపలిగుమ్మంలో నిలవబడి చూస్తూ ఉన్నది. కొంతసేపటికి రామచంద్రుడు సంగతంతా

చెబుతూ తనకిక మీదట ఆఒక్కపూటగంజి ఆధారము రేపటినుండి లేదని గ్రుడ్ల నీరు గ్రుక్కాడు. ఇక ఆపేద కుటుంబీకులయొక్క అప్పటి మానసికస్థితి వర్ణించి వివరించటంకంటే ఊహాప్రపంచంలో ఆస్థితిని గ్రహించ ప్రయత్నించుట మంచిది.

అతని మాతృదేవత కొడుకు కన్నీరు చూడలేక పోయింది. తాను ముదిగా ఉన్నానను దృష్టికూడా ఆమెకు నశించింది. వెంటనే కొడుకుదగ్గరగావెళ్లి కూర్చుని వీపుమీద చేయివేసి "నాయనా విచారించకు. భగవంతు డన్నవాడు ఉన్నాడు. పుట్టించినవాడు పూరిమేపడు కదా. న్యాయానికి ధర్మానికి ఈప్రపంచంలో ఏమాత్రమైనా చోటున్నదిఉంటే నిజం నిలకడమీద బయల్పడి నీఅధికారాలు నీకు న్యాయం ఇప్పించకపోరు. లే. భోజనంచెయ్యి. మనస్సు కొంచం దిటవు తెచ్చుకో" అని బుజ్జగింపుగాను ఓదార్పుగాను చెప్పింది. తండ్రికూడా భార్య చెప్పినట్టుగానే కొడుకునకు ధైర్యవచనాలుచెప్పి ఓదార్చాడు. అయినప్పటికీ, ప్రస్తుతకాలపు ప్రపంచ ధర్మాన్ని బాగ వాడి వడపోయడంవల్ల 'అధికారులు న్యాయం కలుగ చేస్తారు' అన్న ముక్కను వాడ లేదు.

తల్లి బలవంతంమీద భోజనం అయిందనిపించుకొని రామచంద్రుడు ఇవతలికి వచ్చాడు. ఏదో తన స్వంత పనిమీద వీధిలోనుంచి నడిచివెళ్లి పోతూఉన్న తన దూరపుబంధువైన ఒకలాయరు ఇతనికంట బడ్డాడు. వెంటనే వీధిలోకివెళ్లి అతన్ని లోనికాహ్వానించాడు. అతనూ స్వభావంచేత చాలమంచివాడు.

అలాగు పిల్చినందుకు మాటతీసి వేయకుండా లోపలికివచ్చి రామచంద్రుడి తల్లిదండ్రులను పల్కరించాడు. ఆవృద్ధదంపతులిద్దరూ కుశలప్రశ్నలు చేసి కూర్చోమనిచెప్పి తమకప్పుడే తటస్థించినవిపత్తును విపులంగాచెప్పడం మొదలుపెట్టారు. అతడునూ ఇదంతావిని చాలా విచారించాడు. కాని నిస్పృహ కనబరచలేదు. మర్నాడుఉదయం రామచంద్రుడ్ని తనఇంటికి రావలసినదిగాచెబుతూ అధికారులకు వినతిపత్ర మొకదానిని తయారుచేసి మనం పంపుదాము. తప్పకుండా కాంగ్రెసుగవర్నమెంటు న్యాయం జరిపించటానికి ఎక్కువశ్రద్ధ చూపుతుంది. అని చెప్పి వెళ్లిపోయాడు.

నాలుగురోజులు గడిచాయి. శనివారం సాయంకాలం ప్లీడరుగారూ, రామచంద్రుడూ, హిందూపత్రికను చదువుతున్నారు. చక్రవర్తి రాజాజీగారియొక్క వ్యాసం చదువుతూ, కాంగ్రెసు గవర్నమెంటుయొక్క న్యాయపక్షపాతాన్ని, వితరణశీలాన్నీ పొగడుతూ ఆనందిస్తున్నారు. విశాఖపట్నంలో ఇండ్లకు ఉత్తరాలు అందేటప్పటికల్లా సాయంకాలం సుమారుగా 6 గంటలు కొట్టుచుండును. వీధిలో ఉత్తరాలు పంచుకొంటూవచ్చిన పోస్టుబంట్రోతు వీరిదగ్గరఆగి ఒక పొడుగుకవరును, తీసి వీరివద్ద విసరేసిపోయాడు. ఆకవరును చూసీచూడటంతోటే, "మును పెప్పుడేనా చిన్నతాబేదార్లుపెట్టుకున్న అర్జీలకు ఇంతత్వరలో జవాబులువచ్చిన పాపాన్నిపోయేనా? మన అదృష్టవశాత్తు న్యాయపక్షం అధికారంలోకి రావడం, మన మొరలువిని నిజం కనుక్కొందికి ప్రయత్నించి ఆ లోపాన్ని దిద్దటానికి ప్రయత్నించటం జరుగుతూ ఉంది. ఇది గవర్నమెంటు కవరు. దానికి జవాబు అయివుంటుంది" అనిఅంటూ ప్లీడరుగారు ఆకవరును తృప్తికరమైనదృష్టులతో క్రిందామీదా ఒకసారిచూచి కవరు మూతవిప్పాడు. లోపలి కాగితంలో నిండా రెండువరుసలు లేవు. పైవరుసచూస్తూవుండగానే ప్లీడరు గారిమొహం నల్లగా మార్పుకావడం జరిగింది. దాన్ని గమనిస్తున్న రామచంద్రుడికి అసంగతులు బోధపడినయి.

ఇంకేముంది. అధికారులు మామూలు పంథాలో గుడ్డెద్దువాటంగా వ్రాస్తున్నప్రకారంగానే ఉంది. "మేమిందులో దఖలు పుచ్చుకోనము" అనే వాడుకైన మూడుముక్కలు. న్యాయానికి ఇంకెక్కడికి పోవడము?

## కాశ్మీరము

శ్రీ జి. వి. దళపతినాయుడుగారు

(వెనుకటి తరవాయి)

ఇచ్చటనుండి దాటునప్పటికి 5 మైళ్లదూరమున

వారినాగ్

గలదు. 6500 అడుగుల యెత్తు. అష్టకోణములుగల రాతికోనేటిలో వారినాగ్ బుగ్గ వుత్పత్తిఅగును. యీ తటాకము చుట్టును మొగల్ సామ్రాజ్య శిల్పకళానిపుణతను దెలుపు పెద్దకట్టడములు శిథిలములై యున్నవి. ఈ కట్టడముల చరిత్రను దెల్పు శాసనములు కొన్ని యీ గోడలపై చెక్కబడియున్నవి. ప్రేక్షకులు వర్షసమయములలో కూర్చొనుటకు యీ గోడలలో కొన్ని గూండ్లు గలవు. ఈ కొలనులోనుండి అనేకవేల చేపలు పశ్చిమమున ప్రవహించుచుండు ప్రవాహములోనికి పోవుచుండును. ఈ తటాకమునకు ముందు ప్రక్క మిద్దె మెట్లవలె వరుసలుగల పెద్దతోట గలదు. చాలయెత్తునుండి దుముకుచుండు నీటిప్రవాహము యీతోటలో పడుచుండును. ఈ సరోవరమునకు నుత్తరపుతట్టు పాడుపడిన రాజమందిరములును కోళాయిలకొరకు అమర్చబడిన పాతమట్టిగొట్టములును గలవు. 16-వ శతాబ్దమున మొగల్ చక్రవర్తి జహంగీరు యీదివ్యమైన కట్టడములు యిచ్చట కట్టించి తన మరణానంతరమున తన శరీరమును యీ శాశ్వతమైన నీటిబుగ్గవద్ద సమాధి చేయవలసినదని కోరియుండెనట. ఆ పరిసరమున డేరాలు వేసుకొనుటకు విశాలప్రదేశము గలదు. శ్రమనివారణజేయు యీ శుద్ధోదకము యెంతయో మనోజ్ఞముగానుండును. ఇచ్చటనుండి 15 మైళ్ల దూరమున రోడ్డుకు తూర్పున అరమైలులో

ఖన్నాబల్

గలదు. దీనికిపైన నదిలో గృహనౌకలు వెళ్లుటకు సాధ్యముకాదు. ఇచ్చటనుండి ఒక్కమైలులో పెద్దపట్టణము 5300 అడుగుల యెత్తున

అనంతనాగ్

గలదు. ఇచ్చట లెక్కకు మిక్కుటముగు నీటి బుగ్గలు గలవు. దీనినే యిస్లామాబాద్ అని కూడా పిలిచెదరు. ఇది కూచిగానున్న పర్వతముమీదనున్నది. ఒకప్పుడు కాశ్మీరదేశము జలార్ణవమైయుండగా కశ్యపఋషి దీనిని జనవాసయోగ్యముగా జేసెనని తెలిపెడు గుర్తులుగలవు. సమస్థానపు అనుపత్రివద్ద పవిత్రమగు బుగ్గలును, హిందూదేవాలయములును గలవు. అమర్నాద్‌కు వెళ్లు యాత్రికులు యిచ్చట రెండుదినములు మజిలిచేయుదురు. ఈబుగ్గల పరిసరమున గంధకమయమగు వేడి నీళ్లు కొండలోనుంచి పొడుచుకొని పైటికి ఝల్లున ప్రవహించుచుండును. చర్మవ్యాధుల నివారణకొరకు యిచ్చట చాలామంది స్నానము చేయుచుందురు. ఇదేగాక యిటువంటివి యీప్రాంతమున చాలాగలవు. పట్టణములో మశీదునందుకూడా ఒకటిగలదు. ఈపట్టణములో అక్రోటు, కొండగోగు, రేల

మొదలగు కొయ్యలమీద అద్భుతమగు తీగెలు, పువ్వులు మొదలగునవిగల చిత్రములు చెక్కెదరు. సొగసైన కుట్టుపనులు పక్షులు, మృగములు, తీగలు, మొదలగు వానివలె కుట్టబడిన ద్వారములకు కిటికీలకు కట్టు పర్దాలను తయారుచేసెదరు. ఇవి అధికముగా యిచ్చటనుండి యెగుమతి అగుచుండును. ఇచ్చట బస యేర్పరచుకొని పరిసరములనున్న కూలర్మాగ్, అచ్చాబల్, పహల్గామ్ మొదలగు ప్రదేశములు చూడవచ్చును. అవి తరువాత వివరించెదను. ఇప్పుడు మనము శ్రీనగర్ దాటిని యిచ్చట నుండి 13 మైళ్లు దూరము రోడ్డుమీదనే పోయినచో

అవంతిపురము

గలదు. 5250 అడుగుల యెత్తునగలదు. ఇచ్చట 9-వ శతాబ్దమున అవంతివర్మ అను రాజు కట్టించిన హిందూదేవాలయములు భూమిలోనుండి యిప్పుడు త్రవ్వబడినవి గలవు. పూర్వపు హిందూశిల్పకళా నైపుణ్యము యీ కట్టడములపై అవశ్య దర్శనీయము. ఇచ్చటనుండి సమతలమున అడవిబూరుగవృక్షములు యిరువరుసలగల రోడ్డుమీద 18 మైళ్లు వెళ్లగా 5200 అడుగుల యెత్తునగల కాశ్మీరదేశపు వేసవి రాజధానియగు శ్రీనగర్ చేరెదము.

రెండవ భాగము

శ్రీనగర్‌లో నివసించుటకు—దీర్ఘకాలముగాని కొద్దిరోజులుగాని—అన్ని మతముల వారికి అనువగు నిలయములు గలవు. అందు ముఖ్యమైన హొటళ్లు సీడాన్ హొటాలు (యూరోపియన్ పద్ధతి) ఖాన్నా హిందూహోటలు (హిందువుల పద్ధతి) ముస్లిం సతారాహోటలు (మహమ్మదీయుల పద్ధతి) జీలంనదిలో నౌకాగృహము నందు కాశ్మీర హిందూహొటాలు గలవు. ఏవిధమైన రుసుంలేక ఉచితముగాని వసించుటకుమాత్రము సనాతనధర్మ ప్రతాపభవన్, సిక్కుధర్మశాల, హబ్జూరిబాగ్‌లోని కాలేజీ సెక్షన్ ఆర్యసమాజమందిరము, హబ్జూరిబాగ్‌లోని గురుకుల్ సెక్షన్ ఆర్యసమాజమందిరము, దుష్టామీఖారు, సిల్కుఫ్యాక్టరీవద్ద బెంగాల్ సాధువుల కొరకు నారాయణమఠం, శంకరాచార్య పర్వతమువద్ద సాధువులకొరకు దుర్గానాగ్ మందిరము, సాధువులకొరకు రాంబాగ్ గలవు. బాడుగకు బంగళాలు దొరకును. అయితే అవి కొద్దిగానున్నందున సందర్భానుసారముగా దొరకును. నిష్కర్షగా దొరకునని నమ్ముటకు వీలులేదు. అమీరాకతల్ అను మొసటివంతెనవద్ద కొన్ని యిండ్లు కాపురముచేయుటకు బాడుగకు దొరకును గాని యివి మంచి ఆరోగ్యవంతమగు వసతులు గలిగియుండవు. కొందరు యూరోపియన్ దొరసానులు గృహనావలలో డబ్బిచ్చు అతిథులకు ఆతిథ్యమొసగెదరు. (paying guests) గృహనౌకలు నూర్లకొలది గలవు. ఒక్కొక్కదానికి ఒక్కొక్క రీతిగా రమ్యమగు పేర్లు గలవు. పై అంతస్తులున్నవి కొన్నిగలవు.



శ్రీమతి ఆర్. సుబ్బమ్మగారు, బి.ఏ., ఎల్.టి.,

ప్రథమ వైశ్య పట్టభద్రురాలు. మొల్లజయంతి సమావేశమున వీరొసగిన ఉపన్యాసము వేరొకచో గానవగును.



శ్రీమతి బర్కతురాయ్

ఔరంగబాదు జిల్లా కలెక్టరుగారగు బర్కతు రాయిగారి సతీమణి. అఖిల భారత మహిళాసమాజముయొక్క శాఖను ఔరంగబాదున నెలకొల్పి, పై సమాజము పక్షమున బీదలకొఱకు నొక రాత్రిపాఠశాలను ఏర్పాటుచేసిరి. స్త్రీలకొఱకు క్లబ్బును నెలకొల్పిరి.



శ్రీ గోవిందరాజస్వామి సన్నిధివీధి, తిరుపతి



తిరుపతి దేవస్థాన ధర్మసత్రము. వెనుకభాగమున శ్రీ వేంకటాచలము కానసగును

Photo by Messrs. G. K. Vale & Co., Madras.

# తిరుపతి

'వర్ష'

(గత సంచిక తరువాయి)

తిరుమలకు తరువాత ప్రాముఖ్యమును వహించు దేవాలయంబులు (దిగువ) తిరుపతిలో గలవు. ఇందు ముఖ్యములు శ్రీ గోవిందరాజస్వామివారి దేవస్థానము, శ్రీ కోదండరాజస్వామివారి దేవస్థానము, శ్రీ కపిలేశ్వరస్వామివారి దేవస్థానములు.

శ్రీ గోవిందరాజస్వామివారి యాలయము తిరుపతి రైల్వేస్టేషనుకు అతిసమీపమునయున్నది. మొట్టమొదట కొన్ని వందలేండ్లకు పూర్వము శ్రీ గోవిందరాజపట్టణము శ్రీ కపిలేశ్వర తీర్థమునకు వెళ్లు దారిలో నుండెనట గాని నేడచ్చట దేవాలయ శిథిలములుమాత్రమే మిగిలి స్తూపముగా కానుపించుచున్నవి. శ్రీ గోవిందరాజస్వామివారి సన్నిధివీథిమధ్య ఏడంతస్థులుగల యొక యున్నతగోపురము గలదు. దాని దాటి తిన్నగా పశ్చిమమున జేగిన, శ్రీవారి యాలయప్రాకారము ప్రత్యక్షమగును. ఇంత పెద్ద ప్రాకారములుగల దేవస్థానము దక్షిణదేశములో చాలా అరుదు. బహుశః దీనికిసాటి మరి శ్రీరంగమొక్కటియే యేమో! శ్రీ గోవిందరాజాలయంబున మూలవిరాట్టు శేషశయనుండై శిరంబును పశ్చిమంబున కానించియుండును. శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి వీరు జ్యేష్ఠభ్రాతయనియు, వారికి వచ్చు ద్రవ్యమును కొలిచికొలిచి వీలులేక ఆయాసపడి శేషశాయి పవ్వళించెననియు కొందఱొక కథ చెప్పుదురు. ఈ దేవాలయంబున నైరుతము శ్రీ వేంకటేశ్వర దేవాలయంబునవలె ఉత్సవవిగ్రహము, గరుత్మంతుని, హనుమంతుని విగ్రహములు గలవు. శ్రీ వేంకటేశ్వరులకు జరుగుచున్న నిత్యోత్సవములు శ్రీ గోవిందరాజస్వామివారికి జరుగవు కాని జరిగెడి యుత్సవముల పద్ధతియందు భేదమేమియు లేదు. శ్రీ గోవిందరాజస్వామి యాలయము నానుకొని యుప్పుడొక దేవుడు లేని గుడి యొకటియున్నది. అందు శ్రీపార్థసారథి స్వామివారు వేంచేసియుండిరనియు, ఎప్పుడో యే కారణముననో వారిని చెన్నపురి తిరువల్లిక్కేణికి తెచ్చి ప్రతిష్ఠించిరనియు కొందఱి యభిప్రాయము. ఈ దేవళంబుప్రక్కన శ్రీ ఆండాళ్ (చూడికొడుత్త నాచ్చియార్ లేక ఆముక్తమాల్యద)గారి ఆలయమున్నది. ఈ దేవాలయము దక్షిణపార్శ్వమున విశాలమైన కల్యాణమండపము శిల్పనైపుణ్యముతో మిక్కిలి యలరారుచున్నది.

శ్రీ గోవిందరాజస్వామివారి యాదరణంబులోపల శ్రీ రామానుజాచార్యులవారు (ఉడయవర్లు) శ్రీ కాలైనాచ్చియార్ అమ్మవార్ల దేవాలయము లొకటి ప్రక్క నొకటియున్నవి. శ్రీ కవితార్కికకేసరి శ్రీమద్వేదాంతదేశికులయు, శ్రీ యతీంద్రప్రవీణులు శ్రీ మన్మణవాళ మహామునులయు నాలయంబులు ప్రధానాలయ ప్రాకారబహిరంగణమున నున్నవి. శ్రీ గోవిందరాజస్వామివారికి ప్రతియేడును బ్రహ్మోత్సవము వైశాఖమాసమున శుక్లపక్షమున జరుగును. అట్లే ఆయా దేవాలయముల నియతరీతిని వర్షోత్సవములు, మాసోత్సవములు, నిత్యోత్సవములు జరుపబడుచున్నవి. శ్రీ గోవిందరాజస్వామివారి యాలయమున కెదుటనుండు తిరువీథి సన్నిధివీథి యనియు నుత్తర దక్షిణముల ఉత్తరదక్షిణ మాడవీథులనియు శ్రీవైష్ణవ పరిభాష బరగును. ఈ నాలుగు తిరువీథులను శ్రీవైష్ణవ ప్రాబల్యము చాలాయెక్కువ వీరిలో అనేకులు ఇంటనేకో అరవము మాటాడుచున్నను వ్యవహారాచారాదులందు తెనుగుపద్ధతినే యవలంబించుచున్నారు.

తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివారి యాలయమున కుత్తరమున ఒక అరమైలుదూరమున శ్రీ కోదండరామస్వామివారి యాలయమున్నది. ఇందు మూలవిరాట్టు శ్రీ సీతా రామలక్ష్మణులు నిలబడి యున్నారు. శ్రీరాములవారు కోదండము ధరించియున్నారు కావున ఆలయమునకు శ్రీకోదండరామస్వామి వారి దేవస్థానమని పేరు. శ్రీకోదండరాముల బ్రహ్మోత్సవము ఫాల్గుణంబున అతివైభవముగా జరుగును.

ఈ యాలయమునకు ఇంకా రెండుమైళ్లు ఉత్తరముగా శ్రీ కపిలేశ్వరస్వామివారి దేవాలయము గలదు. ఇది శేషాచలంబునకు తూర్పున కొండ ప్రక్కనుండు తీర్థతీరోపరిభాగంబుననున్నది. ఈ జలపాతసమీపమున శ్రీ కపిలర్షి తపఃఫలముగా శ్రీ పార్వతీపరమేశ్వరులు ఆమహామునికి దర్శనమిచ్చిన ప్రదేశమట గావున అచ్చటి తీర్థము (జలపాతము)నకు 'కపిలతీర్థము' అని వాడుదురు. శ్రీవైష్ణవులు కపిలేశ్వర శబ్దము స్మరించరాదని కావలయు, శఠకోప జియ్యరు ఆ తీర్థసమీపమున వసించియుండుట కారణంబుగా నా జలపాతమును 'ఆళ్వారు తీర్థము' అని వ్యవహరింతురు. శ్రీ కపిలేశ్వరస్వామి దేవస్థానమున నిత్యపూజలు జరుగుచున్నవి.

తిరుపతిలో నింతకంటె ముఖ్యదేవాలయములు లేవు. తిరుచానూరని తిరుపతికి మూడు మైళ్లదూరములో నొక అగ్రహారమున్నది. అచ్చట శ్రీ పద్మావతిగారి దేవాలయమున్నది. ఈ పద్మావతీదేవిగారు శ్రీ వేంకటేశ్వరస్వామివారి భార్యగారట. ఈ పద్మావతిదేవిగారికి అలిమేలుమంగమ్మయనియు వ్యవహారముండుటచే ఆగ్రామమునకు అలిమేలుమంగాపురమ్మనియు పేరు. అంతర్వాహినియైన సువర్ణముఖరి పద్మసరోవరంబునకు వలయు జలంబునిచ్చి, తిరుచానూరు గ్రామమునకు నూత్నశోభ గూర్చుచున్నది. ఏడేడును ఏప్రిల్ నెలలో జరుగు ప్లవోత్సవముగాక బ్రహ్మోత్సవము కార్తీకమాసమున ప్రారంభమై మార్గశీర్ష శుద్ధపంచమీదినంబున జరుగు శ్రీ పద్మసరోవర మంగళాస్నానము ('తీర్థవారి')తో పూర్తియగును. బ్రహ్మోత్సవములో ఏనుగువాహనము కడువిశేషముగా కొనియాడబడుచున్నది. ఈ దేవస్థానములో పాంచరాత్రాగమరీత్యా సౌరమానపద్ధతి ఉత్సవములు జరుపబడుచున్నవి. (శ్రీ వేంకటేశ్వర దేవస్థానమున చాంద్రమానపద్ధతి) శ్రీ పద్మావతి దేవాలయావరణంబులోపల శ్రీ కృష్ణస్వామి శ్రీ సుందరరాజస్వామివారి మందిరంబులును గలవు. శ్రీ సూర్యనారాయణస్వామివారి యాలయము పద్మసరోవర పూర్వతీరంబున గలదు.

తిరుపతి శ్రీవారి కైంకర్యమునకయి నాలుగిండ్ల వైఖానసార్చకులు, ఏడుగు రాచార్యపురుషులు, ఇద్దరు జియ్యంగార్లు, నల్గురు ఏకాంగులు కైకలర్లు వేర్వేరు పనులకు నిర్మింపబడిరి. నేటికిని వీరు తమ తమ పనులను అంత సక్రమముగా నిర్వహించకున్నను, ఆయా హక్కులను గలిగియున్నారు. అనుదినమును (దేవస్థానము కమీషనర్ వారిని తప్ప) అన్ని దేవస్థానముల తాళము చెవులను రాత్రి యొక పెట్టిలోనుంచి 'సీలు' వేసి జియ్యరు స్వాధీనము చేయుచున్నారు. మరుదిన ముదయము కైకలర్లు ఆతాళము చెవుల దీసుకవచ్చి అర్చకునకు చేర్తురు. మనకు తెలిసినంత వఱకు విజయనగర సామ్రాజ్యమునకు తరువాత ఆర్కాటు నవాబులు, వారితరువాత తూర్పు ఇండియా కంపెనీవారు పాలించుచు సమయమునకు తిరుపతిలోనున్న ఒక బైరాగి మఠాధిపతికి క్రీ॥ శ॥ 1843 సం॥రమున దేవస్థాననిర్వహణము నిచ్చివేసిరి. ఈమఠము పేరు హిథరామజీ మఠము. మొదటి "విచారణకర్త" శ్రీ బావాజీ సేవాదాసుగారు. నేడున్న శ్రీమహంతు ప్రయాగదాసుజీగారు పైవారికి ఆఱవతరమువారు. ఈ ఆర్గురపై దేవస్థాన ద్రవ్యాపహరణము చేసినట్లు ఫిర్యాదులు జరిగినవి. అందు శ్రీ మహంతు భగవాన్ దాసుజీవారు 18 మాసముల కారాగారవాసమునుకూడా అనుభవించియున్నారు. ఏదెట్లున్నను తిరుపతియొక్క ప్రస్తుతవైభవమునకు శ్రీ ప్రయాగదాసుగారు చాలా కారకులు. 1933లో తిరుపతి దేవస్థానము చట్టము వచ్చినతర్వాత తత్పాలనము కొంతబాగుపడునని తలచిరిగాని మహంతుల పాలనముకంటె నెన్నోరెట్లు చెడినదని తిరుపతి పౌరుల నిశ్చితాభిప్రాయము. తిరుపతిలో క్షేత్రవాసులనబడు పండాలు కొంత మోసముగూడ కావించుచున్నారు.

# తోటపని

శ్రీ చిలకమర్తి లక్ష్మణాచార్యులుగారు

## గూటీ లేక మార్కాటేజి

ఈపద్ధతి కొమ్మలను క్రిందికివంచుటకు వీలుగాని మొక్కలను అంట్లు త్రొక్కునట్లు చేయువిధము. మిక్కిలి లేతగాఁగాని ముదురుగాఁగాని గాక మంచి నడిమివయస్సుఁగలిగి త్వరగాఁ పెరుగు కొమ్మలను ఏరుకొనవలయును. ఆకొమ్మకు పై చిగురునకు ఐదారు కనుపులక్రిందగా ఒక కణుపునకు క్రిందివైపున పదునైనకత్తితో వాలుగాను నాట్లు పెట్టి కొద్దిగా పేడును తీసివేయవలయును. నాటు 1/4 అంగుళము మొదలు 1/2 అంగుళమువరకు యుండవలెను. అస్థలమునందు ఎఱ్ఱమట్టి 1 పాలును, ఆకుకుళ్లు 1 పాలు (Humus) లేక బాగుగా కుళ్లినపేడ 1 భాగమును చేర్చి, ముద్దఁజేసి, అరచేతితో బిళ్లగాఁ జేసి దానిని ఆకోతలను పూర్తిగాఁ గప్పునట్లు గట్టిగాఁ జుట్టవలెను. ఈమట్టిలో కొంచెము చేపపెంట చేర్చుట చాలామంచిది. దానిపై మరికొంచెము మట్టితో ఒక బంతిగాఁ జేయవలెను. ఆ మట్టిబంతి జాఱిపోకుండ పెంకులతోఁగాని, అరటిచొప్పలోఁగాని దానిచుట్టును అంటియుండునటులు తాడుతోఁ గట్టిగాఁ గట్టవలయును. ఎక్కువ గట్టిగా బిగించరాదు. దానికంటె పైకొమ్మకు ఒక చిన్నబాల్చిని కట్టి, దాని కడుగు భాగమున చిన్నరంధ్ర మేర్పరచి దానిగుండా ఒక గుడ్డవత్తిని బాల్చినుండి మట్టిబండిలోనికిఁ బోవునట్లుగాఁ జేయవలయును. ఆబాల్చిలో నీరుపోసి ఒక్కొక్క చుక్క చొప్పున ఆ మట్టిబండిలోనికి పడునట్లు చేయవలెను. ఈవిధముగా ఆమట్టియుండను తడిగా యుండునట్లు చేయవలెను గాని మట్టి కొట్టుకుపోవునట్లు చేయరాదు. ఈపని వర్షాకాలములో ప్రారంభము చేయవలయును. వర్షములు లేనపుడు మాత్రమే బాల్చిలో నీరు పోయవలయును. ఈ అంటుకట్టు కొమ్మ నడిమివయస్సుఁగలిగి త్వరగాఁ పెరుగుచున్నదైయుండవలెను. మట్టిబంతి యూడిపోకుండయుంచుటకు దానికి క్రిందుగా బంకమట్టితో ఆధార మేర్పరచవలయును. కొన్నిదినములకు ఆకణుపు క్రిందినుండి వ్రేళ్లు పయలుజేరి, అరటిచొప్పను పొడుచుకొని బయటికివచ్చును. అప్పుడు మట్టిబంతికి క్రిందుగా పదునైనకత్తితో ఆకొమ్మను ఏటవాలుగా పేడు లేగకుండా కోయవలెను. ఈ 'అంటు' మొక్కను తల్లిచెట్టునుండి పైన వివరించినట్లు గాలి చల్లగాను, తేమగాను వున్నపుడు విడదీసి వెంటనే పాతవలెను. ఈ పని మన ప్రాంతములలో ఆగష్టు, సెప్టెంబరు నెలలలో మొదలుపెట్టి జనవరినెలలో సమాప్తము చేయవచ్చును. ఈపద్ధతి మామిడి, నారింజ మొదలగు ఫలవృక్షములకును ఎత్తుగా పెరుగు పూలచెట్లకును మిక్కిలి అనుకూలముగానుండును.

## Cuttings (మొక్కల కాండముల నాటుట)

కొన్నిసమయములలో బాగుగా ముదిరిన కొమ్మలను భూమికి సమీపముగాను, రెండు కొమ్మలు కలియు చోటునుండి తీసినట్టియు ముక్కలు నాటుట మిక్కిలి ప్రశస్తము. కొమ్మలో మూడుకణుపులుండి ఒక చిగురునకు క్రిందగా కోయబడవలెను. ఈ ఈముక్కలో ఒక మూడవవంతు అనగా మొదటి గణుపును, దానిదగ్గనుండు చిగురును పూర్తిగాను, రెండవగణుపు భూమిపై ఒక అంగుళము పైకియుండునట్లును కుండీలలో పాతవలెను. కుండీలో పోయు మట్టి ఈక్రింద నుదహరింపబడిన పాళ్లలో నుండవలెను.

| | |
|---|---|
| మంచి యేటియిసుక | 1 భాగము |
| ఆకుకుళ్లు లేక ఆకుచీకు | 1 „ |
| ఎఱ్ఱమట్టి | 1 „ |
| పశువుల పెంట | 1 „ |

ఇవి బాగుగాకలిపి కుండీలలో పోయవలెను. కుండీలయొక్క అడుగునున్న కన్నములు కప్పబడకుండా పెంకుముక్కలను గాని, బొగ్గులను గాని మొదటి రెండు మూడు అంగుళములవరకును గుల్లగా పోసి దానిపై పైవిధముగా కలపబడిన మట్టినిపోసి దట్టముగా నింపవలెను. వీటిని పోయునప్పుడు మట్టి చెదిరిపోకుండా నీటిని మెల్లగా చల్లవలెను. ఈపనికై రోజుకాన్ (Rose can) ఉపయోగించుట మంచిది. కొమ్మలను ముక్కలుగా కోయునప్పుడు పదునైన కత్తితో ఒకేవేటుతో తెగునట్లుగాను, కొంచెము ఏటవాలుగాను కోయవలెను. ఈ ముక్కలను కోసిన వెంటనే ఆలస్యముచేయక పాతవలెను. కొమ్మలపై విస్తారముగానున్న ముదురుఆకులను తీసివైచి చిగుళ్లకపాయము రాకుండనుంచవలెను. ఈ ముక్కను కుండీలో పైనచెప్పినట్లు కొంచెము ఏటవాలుగా పాతి దాని తలపై పేడముద్ద మంచవలెను. కొమ్మలను పాతినవెంటనే నీటినిజల్లి చెట్టుక్రిందగాని, చల్లటి స్థలములోగాని యుంచి, క్రమక్రమముగా ఎండతగులునట్లు చేయవలెను. ఈపనిని వర్షకాలములో చేయుట మంచిది. వీటికి మంచిగాలి, వేడిమి, తేమ తగులుచుండవలెను. ఈవిధముగా క్రోటన్సు, గులాబీ, నైటుక్వీను మొదలగు పూమొక్కలను సులభముగా పెంచవచ్చును. చిగుళ్లు బాగుగా బయలుదేరి ఆకులు విస్తరించుచున్నపుడు వేళ్లు బాగుగా బయలుదేరినవని నిర్ధారణ అయినపుడు ఆ మొక్కలను బయటకు తీయవలెను. ఆపనిని మిక్కిలి జాగ్రత్తతో చేయవలెను. వేళ్లు ఆక్రమించినంత మట్టియును చెదరకుండా మట్టికుండతోనే తీసి మనకు కావలసినచోట నాటవలెను. వెంటనే పాతుటకు వీలు కాని మొక్కలయొక్క ముక్కలను, అనగా చెరకు, కర్రపెండలము మొదలగువాటి ముక్కలను చల్లని తేమకలిగిన ప్రదేశమునందు ఉంచినయెడల ఒకనెల అయినను వాటి జీవసత్వము పోనేరదు. పైనిచెప్పబడిన ముక్కలను భూమిలో అడ్డముగా మూడు నాల్గు అంగుళముల లోతున కణుపువద్దనుండు చిగుళ్లు భూమికి పైపైపును, ప్రక్కలను యుండునట్లు పాతవలెను. వీటికి బూజు తెగులు రాకుండా నూరుభాగముల నీటికి ఒకభాగము పోరతికర్పూరము కాని, మైలుతుత్తము గాని, పినాయిల్ గాని కలిపి వాటిలో యీ ముక్కలను (cuttings) ముంచినవెంటనే పాతుటవలన బూజు తెగుళ్లు రానేరవు.

### అంట్లు కట్టుట

ఇది సర్వసాధారణముగా మంచివృక్షము లభివృద్ధిచేయుట కవలంబించు మంచిపద్ధతి. ఇది మంచిరకము చెట్లను సులభముగాను, త్వరితముగాను ఫలసాయము నిచ్చునట్టివిగాచేసి వ్యాపింపజేయు పద్ధతి. ఈ పద్ధతితో వ్యాపింపజేయబడిన వృక్షములకును, తల్లిచెట్టుగా పరిగణింపబడు వృక్షములకును వ్యత్యాస మంతగానుండదు. కొలదికాలములోనే వృక్షములను ఫలించునట్లుగా చేయవచ్చును. విత్తనములతో చెట్లను పెంచినచో ఫలించుటకు చాల కాలము పట్టుటయేగాక తల్లిచెట్టుయొక్క గుణములు పూర్తిగా మారిపోవచ్చును. విత్తనములు మొలకలెత్తి ఫలింపకపోవచ్చును. అందువలన యీపద్ధతి అవలంభించుటకు మిక్కిలి అనుకూలముగానుండును. ఈ పద్ధతియందు మిక్కిలి నిపుణత జూపవలెను. మొదట పనికి కొంచెము భంగము కలిగినను క్రమముగా నేర్పుచేత జయము గాంచవచ్చును.

# సువాసనలు—ఓషధులు

"తమరు గృహలక్ష్మి అక్టోబరు సంచికలో 589 పేజీయందు శ్రీమతి కె. సుగుణమణిగారిచే 'పుష్పము' అని వ్రాసి వెలువడిన వ్యాసమునందు సువాసనలు, వానికి బదులుగా పరిమళించు (substitutes), ఓషధులు (drugs) కొన్నింటిని వెల్లడించినారు. అందు కస్తూరికి బదులుగా ట్రైనైట్రోబ్యుటైలు అను drug పరిమళించునని వ్రాసియున్నారు. నేను యీ ట్రైనైట్రోబ్యుటైలుగూర్చి బ్రిటిషుఫార్మకోపియానున్న ఇర్గోయిన్ కంపెనీ కేటలాగున్న చూడగా అందు కాన్పించలేదు. తమరు నాయందు దయయుంచి ట్రైనైట్రోబ్యుటైలు ఏమిగుణముగలదో యేషాపులలో దొరకునో వారి అడ్రసున్ను వివరము వెంటనే తెలియపర్చగలందులకు మిక్కిలి ప్రార్థించుచున్నాను.

డాక్టర్ B. R. కృష్ణరావు."

*   *   *

"పైయుత్తరము వ్రాసిన వారు artificial సెంట్లు, అత్తర్లు మున్నగువాటిలో కుతూహలము కలిగియున్నందున యీక్రింది additional informationకూడ పొందుటకు సంతసింతురని తలంచెదను.

కావలసివచ్చిన information సైన్సుకు సంబంధించినది గనుక ఆంధ్రమునకన్న యింగ్లమునచే జవాబిచ్చిన సుబోధకమగుననియు, వారుకూడ యింగ్లీషుడాక్టర్లే గనుకను జవాబు యింగ్లీషున వ్రాసి పంపుచుంటిని.

The organic chemical compound which possesses the odour of 'Musk' is a *2:4:6 trinitro derivative obtained by nitrating the (tertiary-meta-butyl-toluene)* whose chemical constitution is as follows: $C_6 H_4 (CH_3) C.CH_3$.

This artificial musk and some nearly related nitro-compounds having a similar odour are now manufactured in large quantities in Europe and are relatively cheap (8 shillings a pound in 1934). There is another compound whose commercial name is 'exaltone'* which is a far-superior-musk-substitute, but costs more than £ 30 per ounce.

'Exaltone' is a Ketone whose chemical name is cyclo-penta-decanone (of the formula $C_{15} H_{28} O$). They are 3 other related higher Ketons of the formulae $C_{16} H_{30} O$, $C_{17} H_{32} O$, $C_{18} H_{34} O$ which possess the small of 'civet' (పునుగు). 'పునుగు', 'జవ్వాది' అనునవి 'కస్తూరి'వంటి పరిమళ ద్రవ్యములే. కస్తూరిమృగము నాభినుండి కస్తూరి తీసినట్లు, పునుగుపిల్లినుండి తీసిన పునుగు స్వాభావికమైన (natural) పునుగు.

* Can be had from any foreign firm dealing with artificial perfumes.

## Some more information regarding artificial Essences and Perfumes.

| CHEMICAL | SMELL | USES & OTHER REMARKS |
|---|---|---|
| Amyl acetate [$CH_3\ COOC_5\ H_{11}$] ... | Pears, bananas ... | is an agreable-smelling liquid. |
| " butyrate | Apricot, banana, pine-apple, rose and straw berries ... | widely used. |
| Butyl butyrate ... | Pine-apples ... | very fine odour. |
| " formate ... | Plums ... | has nice penetrating smell. |
| " valerianate ... | Ripe-apples ... | used for fruit flavours as well as in perfumery. |
| Lauric aldehyde ... | Laurel (పొన్న) ... | చాల ఘాటైన వాసన. |
| Benzyl acetate ... | Jasmin (మల్లి) ... | శుద్ధమల్లి, తదితర అత్తరులలో సులభముగ కలిసి పోయి తెలియరాకుండును. |
| Diacetyl ... | Butter ... | permitted to be used by licensed 'Margaline' dealers (కృత్రిమ వెన్న). |
| Citralal ... | Lemon ... | very good. |
| Ethyl-iso-amyl-oxy-butyrate ... | Very fine fruity-odour... | used in 'ice-creams', etc. |
| Ethyl Sebacate ... | " | |
| " Nonylate ... | Rose | |
| Phenyl-ethyl-butyrate... | " | |
| " iso-butyrate ... | " pronounced fine ... | rose odour. |
| Rhodinol ... | Rose ... | |
| Ethyl-phenyl-acetate ... | Honey-like aroma ... | a little resumbling musk. |
| Farnesol ... | " | |
| Engenol [$C_{10}\ H_{12}\ O_2$] ... | Clove (లవంగ) | |
| & Ionone ... | Violets ... | very largely used in perfumery. |
| (Alpha) ... | | |

కే. సుగుణమణి.

కాని అదేలాపాడాలని ఎవరూఎలాంటి తీర్మానము చేసినట్లు కనబడదు. ఎవరియిష్టమువచ్చినట్లు వారు పాడుతూవున్నారు. ఆపాడు రకాలలో కొన్ని చెవికింపుగా, సాధారణంగా, అసహ్యంగా, దుర్భరంగా, వుంటున్నాయి. అన్ని రాగాల్లోనూ అన్ని పద్ధతుల్లోనూ—హిందూస్థానీ, మరాటీ, ఆంధ్ర, కర్నాటక—పాడుతూ వుంటారు. అంతేగాని జనసామాన్యం అంతా సులభంగా ఒకరేగాని అందరు కలసిగాని శ్రావ్యంగా పాడడం కనపడదు. 1916 లక్నో కాంగ్రెసు సమావేశంలో పాడిన దానిపైన ఆధారపడుతూ ఉత్తరదక్షిణ దేశీయులకు సాధారణమైన బేహాగ్ రాగం క్రింద సూచిస్తున్నాము. అది ఎంతవరకు ఉపయోగపడుతుందో పాఠకులే గ్రహిస్తారు.

సప రి గ మ ప గ సా
వందేమా - - - త రం
స స గ ప _ ప మ ప _
సు జ లాం _ సు ఫ లాం
గ మ ప ధ _ ప మ గ రి
మ ల య జ _ శీ త లాం
స స స ని _ రి రి స స
స స్య శ్యా మ — లాం - -
స స రి స - ని ప
మా త ర ం - - -
సా రి స ధ ప రిగ మప గ స॥
వం దే - - - మా - - త రం॥
ప ప ని స _ స స స స - స ని రి రి స స
శు భ్ర జ్యో త్స్న - పు ల కి త _ యా మి నీ - - ం
ని ని ని ధ ప ధ _ ని రి స రి _ స ని ని ధ ధ
ఫు ల్ల కు సు మి త _ ద్రు మ ద ల _ శో భి నీ - ం
మ మ గ మ _ గ మ ప ధ _ ప మ గ రి
సు హా సి నీం _ సు మ ధు ర _ భా షి ణీ ం
స స ని రి రి స స _ ని ని ధ స స
సు ఖ - - దాం - _ వ ర - - దాం
ని ని _ ని ని ని ధ ధ -
- - _ మా - - త రం—
స ప రి గ మ ప గ స॥
వందే మా - - - త రం॥

* హెచ్చుస్వరస్థానములకు పైనగీటులు గీయబడినవి. తగ్గుస్వరస్థానములకు క్రిందగీటులు గలవు.

## 'చదివితే చాలు' ననుకోడం పొరపాటు

"కళాశాల విద్యావిధానంలో నెగ్గుతాం గదా చాలు ననుకుంటే జీవితంలో నెగ్గడానికది పనికిరాదు. తరువాత జీవితంలో ఏ ఉద్యోగానికైనా తగివుండేటట్లు విద్యనభ్యసించాలి. స్వతంత్రంగా ఆలోచించేది నేర్చుకోవాలి. ఇతరుల సలహాలు మంచివే అయినా స్వబుద్ధితో కార్యాలు చేయవలసివుంటుంది. ఈవిధంగా విద్యార్థిని తన్నూ దేశాన్ని అభివృద్ధికి తీసుకొనివస్తుంది.

ప్రతి విద్యార్థిని ప్రత్యేక ప్రవీణత అభివృద్ధిచేసుకోవాలి. వుద్యోగం చేయకపోతేపోయింది. తన కే ఉద్యోగమైనా ఆప్రవీణత ఉపయోగపడుతుంది. విద్యావిధానం రెంటిని అభివృద్ధిచేయాలి–మనోకౌశలాన్ని-చేతి చాతుర్యాన్ని. నేను విద్యార్థినైవుంటే నేను నేర్చుకోదలచేది ఇదే. జీవితం కష్టాలతో కూడి వుండవచ్చు అయినా అది సౌఖ్యపడడానికే సృష్టింపబడింది. ఇతరులు మీ జీవితాలని సౌఖ్యప్రదంగా చేయలేరు."

—మిసెస్ రూజ్‌వెల్టు.

*　　*　　*　　*

## ఇపుడుండే ఆశ్రమం ఒకటే—

"పూర్వం ఆశ్రమాలు నాలుగుండేవి—బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాలంటూ. ముందు జరుపబోయే జీవితానికి తగినశక్తి సామర్థ్యాలు, బలమూ, కౌశలమూ, విద్య సంపాదించుకోవడానికిగాను నియమింపబడ్డది బ్రహ్మచర్యం. ఆకాలమే పైవాని అర్జనకు ఉత్తమోత్తమమైందని పూర్వులఆశయం. వారు విద్యావంతులై గృహభారాన్నివహించే శక్తిసామర్థ్యాలు గడించి ప్రపంచానుభవం కలిగినతరువాతనే గృహస్థాశ్రమంలో ప్రవేశించేవారు. ఆతరువాత గృహభారాన్ని నిర్వహించి కొడుకులను కూతుర్లను కని వారిని పెంచి పెద్దచేసి గృహస్థాశ్రమానికి అర్హులనుగాచేసేవారు. అపుడు వస్తుంది సంఘర్షణ. ఉడుకురక్తంతో నూతనాశయాలతో వుండే కుర్రాళ్లకూ చల్లబడిన జీవితంతో పురాతన భక్తితో వుండే ముసలాళ్లకు పడదు. అందుచేత సంఘజీవితం శాంతంగా జరిగిపోవడానికి పెద్దలేమన్నారు. ముసలాళ్లని వానప్రస్థాశ్రమం తీసుకుని ఇంటికి దూరంగా వుండమన్నారు. పూరికేవుంటే ఉపయోగమేమిటి? చిన్నపిల్లలకు ఆర్యధర్మాలు బోధిస్తూ విద్యావంతులుగా చేయమన్నారు గురుకులాలు పెట్టుకొని. వారికాపని పూర్తిఅయితే సన్యాసంపుచ్చుకొని కేవలం పరలోకదృష్టితోనే ప్రపంచానికి దూరంగా వుండమన్నారు.

ఇపుడు చూస్తే అలాంటి ఆశ్రమాలేమీ లేవు. బ్రహ్మచర్యంయొక్క మంచినిగురించి తెలుసుకోకముందే మనవారు గృహస్థాశ్రమం ప్రవేశపెడతారు బాలబాలికలను. ఆ ఆశ్రమానికి అవసరమైన సామగ్రివారు సంపాదించివుండలేదు. కాబట్టి ఆశ్రమజీవితం వారికి దుర్భరంఅవుతుంది. దానితోనే ముగిస్తుంది. అందుచేత వానప్రస్థాశ్రమం లేనేలేదు. సన్యాసాన్నిగురించి తలపెట్టేవారు అసలేలేరు. ఇంతకు మిగిలింది సంసారాశ్రమం ఒక్కటే.—ఫలితమేమిటంటే మొదటి ఆశ్రమంలో గడించవలసిన విద్యాబలాలు పూజ్యమైనవి. సంసారాశ్రమంలోనిధర్మాలు సన్నగిల్లినవి. వానప్రస్థాశ్రమంలో త్యాగము పరహితచింత పారిపోయాయి. శక్తిహీనతతోడు స్వార్థం పెరిగింది."

—బత్తుల కామాక్షమ్మ, ఒంగోలుసమావేశంలో.



నెల్లూరు స్త్రీ సమాజ సప్తమ వార్షికోత్సవ సమావేశము

# గ్రంథపరిచయము

## శ్రీరాజా వేంకటకృష్ణా రావుబహద్దరువారి జీవితము

ఇది స్నేహలతా కవితాలతాసంఘపుష్పము లందు 53 వది. గ్రంథకర్త శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయడుగారు, కొల్లాపురము, మొరవకొండ పోష్టు, కర్నూలు జిల్లా.

ప్రారంభమున గ్రంథప్రాశస్త్యమునుగూర్చి దీర్ఘముగ తొలిపలుకు గలదు. తరువాత గ్రంథకర్తగారి తీయని నుడులనుగూర్చిన శేషాద్రి రమణకవుల 'రసాస్వాదము.' అనంతరము గ్రంథకర్తగారి ఆత్మవాక్యము పద్యములందు. మున్నుడుల కిది క్రొత్తపద్ధతి. కాని పద్యములు చక్కగనున్నవి.

తరువాత పై జమీందారుగారి జీవితవివరములు, వారి గుణప్రాశస్త్యము గలదు. ఇదివఱకే గృహలక్ష్మియందు విమర్శింపబడిన నిత్యప్రార్థన గ్రంథము నుండి ముద్రింపబడిన సతీవిలాపము–జమీందారు సతి–గారి సరస్వతీదేవిగారి పద్యములు గలవు. తుదపరితాప మనుపేర గ్రంథకర్తగారు కృష్ణారావుగారి మృతికిగలిగిన హృదయపరితాపము చక్కగ పద్యములందు వెల్లడించిరి. దీనికితోడు ఆంగ్లమునకూడ కృష్ణరావుగారి జీవితసంగ్రహమును, ఇతరుల సదభిప్రాయములును గలవు.

ఈ గ్రంథమును జూచినవారి హృదయముల కృష్ణరావుగారి గుణగణముల ఆకర్షించుచున్నవి. వీరి యకాలమరణమునకు వీరి బంధుమిత్రవర్గముతో చేరి పాపము వారి ప్రజలెంత చింతిల్లెదరో!

## ఇందిరా శతకము

కర్త శ్రీ గోవర్ధనం శ్రీరంగాచార్యులు, తాళ్లపూడి. ఇన్ని శతకములుండియు నిది మరల వ్రాయుట కారణ మేమైన నడుగుదు రేమోనని 'లక్ష్మీ యాత్రికులకు త్వద్గుణామృతరుచిగ్గనని శతకంబె కాదుగా శతశతకంబులైన నిక జాలనిపించునె తల్లి యిందిరా' అని సమాధానమిచ్చినారు. అనుకరణములు పెక్కు గలవు. శైలి కొక యుదాహరణము.

మదిని చలత్వమో, మఱపో,
  మాధ్యమొ, భీతియొ, విస్మయంబొకో,
ముదమున బల్కరా వెదను
  బుట్టుతలంపులు వ్యోమవాహినీ
సదకలుమప్రవాహ సమ
  చంచదనర్గళ వాక్యవైఖరిన్
పదయుత నాకొసంగి నను
  సాకగదే ప్రియమార నిందిరా

## కథాచతుష్టయము

సాహిత్యోద్యానమున, చీరాల, తృతీయ స్తబకము. కర్త శ్రీ కర్ణవీర నాగేశ్వరరావుగారు. పుస్తకము వెల తెలియదు.

ఇందు 'శుద్ధి', 'కులగౌరవమునకు బలి', 'తెగిన చెయ్యి', 'దీపావళి' అను నాల్గుకథలు గలవు. ఇవన్నియు అనువాదములే. వీనికి మూలము తెలుపబడలేదు. కథలు 'తెగినచేయి' తప్ప సంస్కరణాభిలాషగలవి. ఈకథలు మూలమున నెవరివో గాని ప్రసిద్ధ హస్తములనుండి వెలువడినటులు మాత్రము తోచును. అనువాదము భావయు సరళముగాలేదు.

## కథాగుచ్ఛము

మారుతీ గ్రంథమండలి, ఉరవకొండ, అనంతపురముజిల్లా, వారి ఆరవప్రచురణము. కర్త శ్రీ పి. ఎస్. ఆచార్యగారు. ఇందు 'పశ్చాత్తాపము', 'సిగ్గులచేటు', 'పొరపాటు', 'పేదజీతము' అను నాల్గు

కథలు గలవు. వెల చందాదారులకు 0-8-0. ఇతరులకు 0-10-0.

కథలు ఉపజ్ఞనుండి శైలి జేరినవిగా గన్పడుట లేదు. ఎచటనుండియో కథావస్తువులనుగొని వానిని ఇష్టమువచ్చినరీతి మార్చినట్లు గన్పడియెడిని. శైలి సరళముగ నేయున్నను భావ సంకరమైనది. గ్రంథకర్త గారు పూనికతో ప్రయత్నించుచో సాంఘికజీవిత మందలి విషయముల చక్కని కథలు వ్రాయగలరను నమ్మక మీ పుస్తకము గలిగించుచున్నది.

## మేఘప్రతి సందేశగీతము

మారుతీగ్రంథమండలి ఏడవ ప్రచురణము. కర్త శ్రీ కప్పగల్లు సంజీవమూర్తిగారు. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 0-10-0.

'మహాకవి కాళిదాసకృతమగు మేఘసందేశ కావ్యమునందు చెప్పబడిన యక్షసందేశవచనములకు నతని భార్యయొసంగిన యనురూప ప్రతివచనములే' ప్రతిసందేశకావ్యము. దీనిని సంస్కృతమున సర్గద్వయాత్మకముగా, మందాక్రాంత వృత్తయుతముగా మైసూరు మహారాజాస్థాన కవివరులగు మండికల్ రామశాస్త్రి గారు రచించిరి. దాని మాతృకగా శ్రీ విద్వాన్ కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రులు గారు రచించిన ఆంధ్రవృత్తమును గీతములుగ గ్రంథకర్త గారు రచించిరి.

కాళిదాసు మహాకవి మేఘసందేశములోని భావ సాపటి ఖండాంతరములందలి పండితుల మనములను గూడ చూరగొన్నది.

అట్టి ఉత్తమ కావ్యము సుఖాంతముగా లేదే యని హిందూహృదయము దానిని సౌఖ్యాంతముగా చేసినది. ఆచేయుటలో—అనగా కాళిదాస మహాకవితో పోటీ సల్పుటలో—మహోన్నత ప్రతిభ చూపవలసి వచ్చినది.

సరళములై, సరసములై, మనోహరముగ రచింపబడిన యీగీతముల జదివిన ప్రతివారును కాళిదాసు రచన కిది రవంతమాత్రము దీసిపోదని యెఱుంగ గలరు. వియోగభరమున క్రుంగిన స్త్రీ కోమలహృదయము యీ గీతములందు నాట్యమాడుచున్నది.

"తోడఁ బరుండఁగఁ జేసి మైఁదడవి, యక్కుఁ
జేర్చి, నీచేతి లేఁతపద్రికను బెట్టి,
ముద్దొనర్చుచుఁ బ్రీతి మై మున్ను నీవు
పెంచుచుండిన మన జింకపిల్లలెల్ల—"
"లేక తనకెందు నిదురయే రాకయున్న,
వారిదా! నీకతందు గన్పడెడు వేళ
వామకరతలార్ధమునందు మోమువంచి
కుడిచెయిని వెక్కసునుదిప్పి మెడను మోపి—
జాలిఁగొలుపుచు, పెడమమోఁకాలిమీఁద
నంతఁ దనకుడిమోఁకాలి నాన్చి, మదిని
దుఃఖమూలంబు నెంచు, చేదో తలంచు,
చోదలు పగమునిక్కఁ బరుండి యుండునేమొ.

అనువాదకుల చక్కనిరచన కుదాహరణములుగా పైపద్యములు చాలును గ్రంథమంతయు నిటులనే యుండి చదువనింపు జనింపజేయుచున్నది.

---




### ఆంధ్రవిశ్వకళాపరిషత్తు—స్త్రీలు

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఏర్పడి నేటికి పదియేండ్లు దాటినవి; కాని మద్రాసు విశ్వవిద్యాలయమునుండి దీనిని వేఱుచేసినదానికి ఫలితముగా దీనియెడ నెట్టి ప్రత్యేకతయు గాన్పించుటలేదు. శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డిగారు, ఆంధ్రవిశ్వకళాపరిషత్తును జూచి యితర విశ్వవిద్యాలయములు అనుకరించినవని వచించుచున్నను నిజమునకు ఈ విశ్వకలాపరిషత్తు మద్రాసు విశ్వవిద్యాలయమును అనేకవిధముల ననుకరించుచున్నదనుటలో విప్రతిపత్తిలేదు. ఒకచోట శ్రీ సి. ఆర్. రెడ్డిగారే అన్నివిషయములాలోచించక తొందరతో ఆంధ్రవిశ్వకలాపరిషత్తును వేర్పఱచుటచే ప్రస్తుతము సావకాశముగా విలపించుచున్నామనియు అట్లుగాక ఆంధ్రరాష్ట్ర నిర్మితివిషయముననైనా ముందుగా అన్ని కష్టసుఖములను, లాభనష్టములను గమనింపవలెననియు హెచ్చరించియున్నారు.

అయితే ఆంధ్రవిశ్వకలాపరిషత్తునకు ప్రత్యేకత చేకూర్చు టెట్లు అను ప్రశ్నకు సమాధానము విద్యాధికులు చెప్ప సమర్థులు. మావి ఒండు రెండు సలహాలుమాత్రము. అధికారులు వీని నెంతమట్టుకు మన్నింతురో?

స్త్రీ పురుష విద్యార్థులొక్కచోటనే విద్యగఱచుటలో నష్టములకన్న లాభములే యెక్కుడని నిర్ధారింపబడిన దనవచ్చును. అందుకై యిచట చర్చకు గడంగుట అనవసరము. పైసూత్రమునే యాధారముగా జేసికొని ఆంధ్రవిశ్వకళాపరిషత్తున నేమి జరుగుచున్నదో యోజింతము. అచటి ఆనర్సు కాలేజీలలో నిట్టివిద్యయే (co-education) యొసగబడుచున్నది. కానీ విద్యార్థినుల మొత్తము సంఖ్య మూడో, నాలుగో. అంతే. దీనికి కారణ మేమయియుండును? స్త్రీవిద్యార్థు లిచటి కాకర్షింపబడక పోవుటకు హేతువేమి?

చాలామట్టుకు అన్ని శాస్త్రములందును స్త్రీలు పురుషులు అను భేదములేక యిరుజాతులును విద్య నభ్యసింపవచ్చును. అయినా కొన్నిటియందు (గృహశాస్త్రాదులు–Domestic Science etc.) ముఖ్యముగా స్త్రీలుమాత్రమే విద్య నభ్యసింపవచ్చును. ఇట్టి శాస్త్రములందు శిక్షణ మొసగుటకు కళాశాలలేవీ? ఇతర శాస్త్రములందు విద్యగఱచు విద్యార్థినులకు వసతిగృహము లేవీ? కలకత్తాలోవలె నిట విద్యార్థినులకు (కళాశాలలో చదువకయే ప్రయివేటుగా రీక్షకు వెళ్లుట మొదలగు) అవకాశము

లాంధ్రవిశ్వకళాపరిషత్తులో లేవు. ఇట్టి వెన్నేని లోపములుగలవు.

ఇన్నినాళ్లు విశ్వకలాపరిష దధికారులు వీనియన్నిటికి ధనాభావమే కారణమని చెప్పుచుండిరి. ఇది నిజమే యనుకొన్నను నిక నట్టి కారణములకు తావుండదు. ఆంధ్ర విశ్వకలాపరిషత్తువారు ఆంధ్రస్త్రీలను ఇతర ప్రపంచమునకు ఆదర్శలగాజేయు సంకల్పమే యున్నెడల వారిక తామసించవలసిన యగత్యమేలేదు. మొన్న స్నాతకోత్సవసభలో శ్రీమతి సేతుపార్వతీబాయిగారును తిరువాన్కూరు మహారాజావారును ఒకలక్ష రూపాయల విరాళమొసగినట్లు వైస్‌ఛాన్సలర్‌గారు ప్రకటించియున్నారు. స్త్రీవిద్యకు దీనిని మూలధనముగా నుంచుకొనెదమన్న యూనివర్సిటీవారి కోరికను మహారాజా మహారాణీలు వద్దనరు. వారికిని విశ్వకలా పరిషత్తునకును ఆచంద్రార్కము యశస్సుండ గలదు. దీనికై యాలసించక "శుభస్య శీఘ్రమ్మ"ని నడుకట్టుకొని విశ్వకలాపరిషత్తు వారు పూనుకొందురా?

### వరకట్న నివారణ శాసనము

కొన్నిభూతములు పట్టినచో త్వరగా వదలవని ప్రతీతి. దేశ దౌర్భాగ్యమువలన మన సంఘమును దురాచార పిశాచములు కొన్ని యావేశించినవి. విద్యావ్యాప్తి వాని పట్టును కొంతవఱకు వదిలించినది. కాని వాని నిర్మూలము పూర్తికాలేదు. అట్టి వానిలో వరకట్న పిశాచమొకటి. కళ్యాణ ప్రదములు గావలసిన కళ్యాణములందిది ప్రవేశించి పండువంటి కాపురముల పాడు చేయుచున్నది. విద్యావంతులయ్యు, ఇందలి యన్యాయమును అమానుషత్వమును గురుతించియు కొందఱు దీనికి లోనగుచున్నారు. ఇదియొక రాష్ట్రముందుగాక భారతదేశమందంతటనుగలదు.

ఈ భూతబాధ తొలగించుటకై యొక మహాశయుడు సింధురాష్ట్రీయ శాసనసభయందు 'వరకట్న నివారణశాసనము' నొకటి ప్రవేశపెట్టదలంచి చిత్తు చట్టమును తయారు చేసినటుల తెలియుచున్నది. ఈ శాసనోద్దేశమిది. వరకట్నమిచ్చుటగాని తీసికొనుటగాని ఇండియన్ క్రిమినల్ చట్టముక్రింద నేరముగా పరిగణింపబడవలెను. ఇచ్చువారు మనఃపూర్వకముగ వరకట్నమిచ్చుచున్నామన్నను అది నేరముగనే పరిగణింపబడవలయును.

విద్యావ్యాప్తి సంస్కరణాభిలాష ఇంకను విరివి గాంచవలసియున్నవి. అందుచే ఇట్టి చట్టములు శారదాచట్టమువలె నిర్జీవములుగావచ్చును. కాని అసలే శాసనము దిట్టముగ చేయించినచో క్రమక్రమముగ వరకట్న పిశాచబాధ తొలగగలదు. ఆబిల్లు ప్రవేశపెట్టబడి చట్టమగునని యాశించుచున్నాము.

ఈ దురాచారమువలన గలుగుచుండు ఫలితముల గనులార చూచుచుండు మన రాష్ట్రీయులు కూడ నట్టి చట్టమును ప్రవేశపెట్ట ప్రయత్నింతురని మామనవి. సాంఘికోన్నతికి గావలసిన యిట్టి చట్టముల నిర్మింప జేయుటకు కాంగ్రెసు ప్రభుత్వమువారు ఈ యవకాశమును పూర్తిగ వినియోగించుకొనవలయుననియే కోరెదము.

EDITED BY DR. K. N. KESARI, PRINTED AND PUBLISHED
BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్ఠయైన మొదటిదినము మొదలు లెక్కపెట్టుకొనవలయును. క్రిందకనుబరచిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1.వ తారీఖున గర్భము ధరించినయెడల రెండవపంక్తి అక్టోబరు 8-వ తారీఖున ప్రసవించెదరు.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | | | | డిసెంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసెంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 33 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూన్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూన్ |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 23 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగస్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగస్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూన్ |
| సెప్టెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | సెప్టెంబరు |
| జూన్ | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 38 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | ఆగస్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగస్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టెంబరు |
| డిసెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసెంబరు |
| సెప్టెంబరు | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | అక్టోబరు |

## ఈశ్వర సంllర కార్తిక మార్గశిరములు

1938 వ సంll జనవరి నెల

1 అమాll ● శ రా11-26 మూప2-55 వప1-9 దుం2-55కు
2 శుll పా ఆ రా1-24 పూషా సా5-24 వరా2-6 దుం3-51 భో7-26
3 విll సో రా3-4 ఉషారా7-37 వరా12-56 దుం2-38కు భో7-22
4 తిll మం తె4-15 శ్రరా9-25 వరా2-40 దుం4-22 భో7-18
5 చll బు తె4-59 ధరా10-47 వతె6-11 దుం భో7-14
6 పంll గు తె5-6 శరా11-36 శవఉ7-50 వతె6-2 భో7-10
7 షll శు తె4-48 పూభా రా11-59 శఉ7-40కు భో7-5
8 సll శ తె3-53 ఉభా రా11-48 వఉ9-30 దుం10-59 భో7-0
9 అll ఆ తె2-39 రేరా11-16 వప11-31 దుం1-5కు భో6-56
10 నll సో రా12-58 అశ్వరా10-18 వసా6-27 దుం7-59కు భో6-51
11 దll మం రా10-32 భరా9-5 వఉ7-25 దుం8-56కు భో6-46
12 ఏll బు రా8-53 కృ రా7-37 వఉ8-21 దుం9-51కు భో6-41 ముక్కోటిఏకాదశి
13 ద్వాll గు సా6-25 రోసా 6-1 వఉ10-33 దుం12-3కు భో6-36 మకరసంll ప్రవేశము
14 త్రిll శు సా4-14 మృసా4-21 వరా12-10 దుం1-59కు మ భో8-20 ఉత్తరాయణపుణ్యకాలము
15 చతుll శ ప1-53 ఆర్ద్ర ప2-41 వరా2-51 దుం4-21కు భో8-16 తిథిద్వయం
16 పూ ○ ఆ ప11-39 పున ప1-8 వరా8-39 దుం10-9కు భో8-12 ప్రతిపత్తిథిః
17 బహుll సో ఉ9-34 పుష్య ప11-46 వరా11-58 దుం1-30కు భో8-8 గుర్వ స్తమయము
18 విll మం ఉ7-46 తదియ తె6-7 ఆశ్లే ప10-39 వరా10-15 దుం11-48కు భో8-4
19 చll బు తె5-4 మఘ ఉ9-52 వసా5-43 దుం7-1కు భో8-0
20 పంll గు తె4-22 పుబ్బ ఉ9-28 వసా4-41 దుం6-17కు
21 షll శు తె4-15 ఉష ఉ9-31 వసా6-4 దుం7-42కు భో7-51
22 సll శ తె4-30 హ ఉ10-3 వరా7-17 దుం8-57కు భో7-47
23 అll ఆ తె5-30 చిత్త ప11-4 వసా5-2 దుం6-44కు భో7-43
24 నll సో పూ స్వాతి ప12-36 వసా6-39 దుం8-23కు భో7-38
25 దll మం ఉ6-55 విశా ప2-32 వరా6-55 దుం8-41కు
26 దll బు ఉ8-40 అనూ ప4-52 వరా11-4 దుం12-50కు భో7-30
27 ఏll గు ఉ10-42 జ్యేరా7-24 వతె4-17 దుం6-3కు భో7-26
28 ద్వాll శు ప12-52 మూ రా10-2 వ రా8-16 దుం10-2కు భో7-22 త్రయోదశితిథి
29 త్రిll శ ప3-0 పూషా రా12-34 వ ఉ8-39 దుం10-25కు భో7-18 శూన్యతిథి
30 చతుll ఆ ప4-56 ఉషా రా2-54 వ ఉ9-21 దుం11-6కు భో7-14
31 అమా ● సో సా6-30 శ్ర తె4-47 వ ఉ7-12 దుం8-56కు భో7-9

